ఆంధ్రగ్రంధరత్నాకరము ౩వ రత్నము

# సాత్రాజితీ పరిణయము.

ఆంధ్రమత్స్యపురాణ బిల్హణీయేత్యాది బహుగ్రంధప్రణేతలును,

సరసకవితాధురంధరులు నగు

అడవి సాంబశివరాయకవి

విరచితము

[illegible]కులు

ఆంధ్రగ్రంధరత్నాకర కార్యాలయము, గుడివాడ.

శారదా భాండార ముద్రాశాలయందు,

ముద్రితము.

1924

చందాదారులకు ౯అ] కాపీరైటు [ఇతరులకు 12 అ

# ప్రధాన పోషకులు

౧ మ॥ రా॥ శ్రీ లింగం వెంకటసుబ్బయ్యగారు, బొమ్ములూరు.
౨ ,, వల్లూరిపల్లి కోదండరామయ్యగారు, దాకరం.
౩ ,, అడపా సుబ్బారాయుడుగారు, గుడివాడ.
౪ ,, పురాణం సూరిశాస్త్రిగారు బి. ఏ., బందరు.
౫ ,, మల్లిరెడ్డి గురవారెడ్డిగారు, జొన్నపాడు.
౬ ,, మాగంటి వెంకటరామదాసుగారు, తమిరిశ.
౭ ,, చిట్టూరి వెంకటనరసింహంగారు, బందరు.
౮ ,, సూరపనేని సుబ్బయ్యచౌదరిగారు, దింటకుర్రు.
౯ ,, వెల్లంకి రామదాసుచౌదరిగారు, అప్పికట్ల.
౧౦ ,, కొడాలి ఉమామహేశ్వరరావుగారు, జవర్లపూడి.
౧౧ ,, వల్లభనేని రామకృష్ణయ్య చౌదరిగారు, గొలివేపల్లి.
౧౨ ,, కరిపినేని వెంకటరావయ్యగారు, చినపారుపూడి.
౧౩ ,, కామినేని గోపాలకృష్ణయ్యగారు, గుడ్లవల్లేరు.
౧౪ ,, ఉప్పులపాటి నాగయ్యగారు, గురజ.
౧౫ ,, జొన్నలగడ్డ శ్రీరామచంద్రయ్యగారు, గుడివాడ.

# పోషకులు

౧ మ॥ రా॥ శ్రీ నందూరు వరాహలక్ష్మీనృసింహంగారు, అరుగొలను.
౨ ,, పింగళి కుటుంబరావుగారు, లింగాల.
౩ ,, కూచిభట్ల వెంకటాచలపతిశాస్త్రిగారు, కొర్నిపాడు.
౪ ,, గో॥ భా॥ రామచంద్రరావుదొరగారు, ఉలవభద్ర, గంజాంజిల్లా.
౫ ,, యలమంచిలి నాగయ్యగారు, నూజెళ్ల.
౬ ,, శిరిపురపు వెంకటరత్నంగారు, ఎలమర్రు.
౭ ,, కోనేరు నారాయణరావుగారు, భార్లపూడి.
౮ ,, అట్లూరి వెంకటపతిగారు, చవటపల్లి.
౯ ,, పాటిబండ్ల సీతారామయ్యగారు, అరుగొలను
౧౦ ,, సీతంరాజు హనుమంతరావుగారు, జువ్వనపూడి.
౧౧ ,, కే. వెంకటాచలంగారు, పెనుమల్లె.

౧౨ ,, మొవ్వ భూషయ్యగారు, ముదునూరు.
౧౩ ,, పర్వతనేని గంగయ్యగారు, పోలుకొండ.
౧౪ ,, శివలెంక మల్లికార్జునరావుగారు, పెసరమిల్లి.
౧౫ ,, చెలసాని వెంకటరత్నంగారు, చిరుచింతల.
౧౬ ,, వల్లభనేని చౌదరయ్యగారు, గొలివేపల్లి.
౧౭ ,, వల్లభనేని రామశాస్త్రిలుగారు, ,,
౧౮ ,, శింగవరపు రామయ్యగారు, కొమరవోలు.
౧౯ ,, పొట్లూరి సీతయ్యగారు, ,,
౨౦ ,, పొట్లూరి వెంకటరత్నంగారు, ,,
౨౧ ,, హరి గుండేరావుగారు, కల్వపాముల.
౨౨ ,, మానికొండ కుటుంబరావుగారు, ఉరుటూరు.
౨౩ ,, కోవెలమూడి పరంధామయ్యగారు, కోలవెన్ను.
౨౪ ,, ఈడుపుగంటి సీతయ్యగారు, నందివాడ.
౨౫ ,, కొత్తపల్లి రామకుటుంబయ్యగారు, గుడివాడ.
౨౬ ,, బ్రహ్మభొట్ల పట్టాభిరామశర్మగారు, గుడివాడ.
౨౭ ,, రాజ వెంకటరామయ్యగారు, పసుమల్లు.
౨౮ ,, నూకల వీరరాఘవయ్యగారు, కానుమోలు.
౨౯ ,, పోతన శ్రీనివాసరావుగారు, బెజవాడ.
౩౦ ,, అడుసుమల్లి వెంకటకృష్ణయ్యగారు, చిరుచింతల.
౩౧ ,, ఉప్పులూరి ఆదినారాయణమూర్తిగారు, గుడివాడ.
౩౨ ,, తిపిర్నేని సుబ్రహ్మణ్యంగారు, గుడివాడ.
౩౩ ,, పరిమి వెంకటపిచ్చయ్యగారు, వడాలి.
౩౪ ,, కొల్లి చినవెంకటరామయ్యగారు, అప్పికట్ల.
౩౫ శ్రీమతి వల్లూరిపల్లి కనకదుర్గమ్మగారు, వేల్పూరు.
౩౬ మ.రా.శ్రీ. పిడికిటి సూర్యనారాయణగారు. పునాదిపాడు.
౩౭ ,, పాలపర్తి వాలేశంగారు, పాలపర్రు.
౩౮ ,, గూడూరి మల్లికార్జునుడుగారు, కంబారు.
౩౯ ,, కోడూరు రంగయ్యగారు, కోడూరు.
౪౦ ,, అడుసుమల్లి కృష్ణయ్యగారు, డిట్టో
౪౧ ,, కొండపల్లి నారాయణస్వామిరెడ్డిగారు, జొన్నపాడు,
౪౨ ,, కొడాలి వీరభద్రయ్యగారు, చినపారుపూడి.

---

# భూమిక.

శ్లో॥ సత్కవి రసనాశూర్పీ ♦ నిస్తుషతర శబ్దశాలిపాకేన।
తృప్తోదయితా ధరమపి ♦ నాద్రియతేకా సుధాదాసీ॥

గోవర్ధనాచార్యుఁడు.

ఆంధ్ర భాషామతల్లికి యథోచిత సేవసేయు తలంపుతో మేమొక గ్రంథమాలను నెలకొలిపి ఇదివఱకు "దుర్గాదాసు" అను నొక నాటకమును, "కాళిదాసభవభూతులు" అను నొక విమర్శన గ్రంథమును బ్రకటించియున్న సంగతి మాసోదర మహాశయులకు విశదమే. మా గ్రంథమాలయొక్క శ్రేయస్సుగోరు కొందఱు ఈ మాఱు ఏదేని పద్యకావ్యమును బ్రకటించుట యుచితమని తెలుపఁగా శ్రీ అవసు సాంబశివరాయ కవి ప్రణీతమగు సాత్రాజితీ పరిణయమను నీగ్రంథమును మాగ్రంథమాలకు తృతీయ రత్నముగాఁ బ్రకటించితిమి. సాంబశివరాయకవి ఆరువేల నియోగి బ్రాహ్మణుఁడు, సాంఖ్యాయన గోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, కృష్ణయజుశ్శాఖాధ్యాయి, సూర్యోపాసకుఁడు, అద్వైతి. తండ్రి పాపయ్య, తల్లి సీతమాంబ వీరి కాపురము కృష్ణా మండలమందలి కయికలూరు తాలూకాలోని బొమ్మినంపాడు అను గ్రామము. చిరకాలమునుండియు వీరిపూర్వులు ఈగ్రామమునకు కరణీకము చేయుచువచ్చిరి. ఈకవిశేఖరుఁడు క్రీ॥ శ॥ 1864 సం॥ సరియగు రక్తాక్షి సం॥న జన్మించి 1915 సం॥ రాక్షస సం॥న అస్తంగతుఁడయ్యెను. బాల్యమునందే పితృవియోగము సంభవించినందున చతుర్దశ వత్సరములకే కుటుంబనిర్వహణ మొనర్పవలసినవాఁడయ్యెను. అందువలన విద్యోపార్జనమందు క్రమశిక్ష నందుటకు వీలులేకుండియు సహజప్రతిభాశాలియగు నిక్కవిస్వయం కృషిచేతనే సంస్కృతాంధ్రములందు చక్కని పాండిత్యమలవరచుకొనెను. బాల్యమునుండియు సరసమగు కవిత్వము చెప్పుచుండెడివాఁడు. ఆబాల్యపరిగృహీతయగు కవితాకన్యను స్వప్రయత్నబాహుల్యముచే నుచితసంస్కారపరిష్కారముగావించి బహుగ్రంథరచనార్హ నొనరించెను. ఈకవి రచించిన గ్రంథములు.

(1) శుద్ధాంధ్రమేఘసందేశము, (2) హైమవతీ పరిణయము, (3) అశ్వలక్షణసారము, (4) సత్యనారాయణచరిత్ర, (5) అద్వైతమతాదర్శము, (6) సాత్రాజితీ పరిణయము, బిల్వనాథీయము (8) ఆంధ్రమత్స్య పురాణము, (9) నానావిధ స్తోత్రశతకములు శ్రీకృష్ణసుధాలహరి మున్నగునవి. ఇందు శుద్ధాంధ్రమేఘసందేశము, అశ్వలక్షణసారము, సాత్రాజితీయము, కొన్నిశతకములు మాత్రమే ముద్రితములు. హైమవతీపరిణయము, బిల్వనాథీయము 4 ఆశ్వాసములుతప్ప మిగిలిన గ్రంథము నామమాత్రావశిష్టములుగ నున్నవి. మత్స్యపురాణములోని 9౦ పద్యలు

3000 పద్యములుగా నాంధ్రీకరించి గ్రంథము ముగియకముందే యీకవి కీర్తిశేషుఁ డయ్యెను.

సాధారణముగ సత్కవులను దరిద్రత సహధర్మచారిణివలె విడువకయుండును. కవితాకాంతతోఁబాటు దారిద్ర్యదేవతయు నీకవిశిఖామణిని వరించెను. అందుచే నీకవి వానిని ముద్రితము లొనర్చకుండుటవలనను, సన్నిహితులేనియు తద్గ్రంథ రాజముల ప్రాశస్త్యమెఱుంగని వారగుటవలనను కొన్ని గ్రంథములు రూపహీనము లును కొన్ని రామబాణముల వాఁతంబడి జర్జరితములును అగుట తటస్థించినది.

ఈకవియును ఈయన బాల్యమిత్రుఁడగు నందగిరి వెంకటప్పారాయ కవివరుఁ డునుగలిసి "శివవెంకటకవులు" అను నామముతో జగన్నాథీయము, బ్రహ్మపత్రా భ్యుదయము మొదలగు గ్రంథములు రచించిరి. శ్రీ వెంకటప్పారావు పంతులు గారు విశేషప్రయాసకు లోనయి నష్టావశిష్టములగు గ్రంథములకు స్వయముగా ప్రతులువ్రాసి సన్మిత్రధర్మమును నిర్వర్తించిరి. గాని చోనివిక్రాండ ఆంధ్రపాఠకలోక మునకు గగనప్రయాసము లయ్యెడివి. ముద్రణాలయములు ప్రబలిన యీకాలమున రచింపఁబడిన గ్రంథముల గతియిట్లుండ ననుకూలపరిస్థితులు లేనిసమయమున రచింపఁబడిన అమూల్యగ్రంథరత్నములెన్ని కాలగర్భ కుహరమునఁబడి లీనమయినవో యెవరికెఱుక.

ఈగ్రంథముయొక్క గుణాగుణవిమర్శనము పాఠకులకు వదలి మాగ్రంథరత్నా కరమున ఈగ్రంథరత్నమును బ్రకటించుట కనుజ్ఞయొసఁగిన శ్రీ వెంకటప్పారావు పంతులుగారికిని గ్రంథకర్తగారి కుటుంబమునకును మేమెంతయుఁ గృతజ్ఞులమని విన్నవించుచున్నాము.

---

శ్రీ వేంకటరమణాయనమః

# సాత్రాజితీపరిణయము

## ప్రథమాశ్వాసము

శా॥ శ్రీవక్షోజయుగీమృగీమద పరిశ్లేషాంకవిన్యాసశో
భావిస్ఫూర్తిదుఅంగలించుచు రుచిప్రస్ఫీతమై విస్ఫుర
చ్ఛ్రీవత్సాహ్వయ చిహ్నమక్కునఁగడున్ జెల్వొందులోకావన
ప్రావీణ్యుండగు వాసుదేవుని మదిన్ భావించిసేవించెదన్ ౧

చ॥ కలుములలో సంగుప్రోడ త్రిజగంబులు గాంచిన తల్లివొక్కఁ బ్రక్
గలశపయోధికూఁతురు జనార్దను పేరెద రూపువీటపైఁ
దలకొనుముద్దరాలు సితతామరసాంచితపాణి సత్కృపా
కలన రమావధూటి శుభకల్పనమాకొనరించి ప్రోచుతన్ ౨

చ॥ కలుములకొమ్మతోడుతఁ దగన్ గలశాబ్ధిజనించి సమ్మదం
బలరముకుందు పేరెద నయంబలరారనలంకరించి ని
ర్మలమహిమానుభావపటిమన్ దనరారెడు కౌస్తుభంబు దా
నలఘునిరూఢిమాకిడు మహత్వకవిత్వపటుత్వసంపదల్ ౩

ఉ॥ లాలితకాంచనద్యుతి కలాపములీనుచుఁ గల్మిచెల్వకున్
డోలికయోయనంగఁ దులఁదూఁగుచుఁ గేశవు పేరురంబునన్
గ్రాలుచునున్న సత్తులసికాదళగుంఫిత వైజయంతికా
మాలికమాకొసంగుతనమందపటుప్రతిభావిశేషముల్ ౪

క॥ కలిమిచెలి నెమ్మొగమ్మునఁ
గులుకు మృగీమదపురేఖ కొమరున రుచిమం
జులమై ముకుందు నెపెఁదన్
జెలువగు శ్రీవత్సమనెడు చిహ్నముఁదలఁతున్ ౫

చ॥ ఉరుతరశైఖరిన్ యుగపదుత్థితకోటిసహస్రభాను వి
స్ఫురదతిమాత్రదీధితి విశోభితభంగినుదగ్రదైత్యబం
ధురిత తమస్సమూహ హృతిధుర్వహమైన సుదర్శనాఖ్యము
వరమునిచక్రరాజమనవద్యశుభంబులు మాకొసంగుతన్ ౬

# ప్రథమాశ్వాసము

చ॥ అమలినవాసుదేవముఖజానిలపూరితమై ఘుమంఘుమం
ఘుమిత నినాదమయ్యసుర కోటులగుండెలు వ్రయ్యమ్రోయుచున్
సమశతకోటిశీతకరసన్నిభ కాంతిఁదలిర్చుపాంచ జ
న్యమనెడు శంఖరాజముసమగ్ర శుభంబులుమాకొసంగుతన్ ౭

ఉ॥ మేదురకాంచనాచల సమిద్ధపటిష్ఠత శత్రుదేహని
ర్భేదనకాళలంబున పరిష్కృతఁజూపు నిజప్రసక్తికిన్
సాదరలీల మెచ్చి నళినాక్షుఁడు కేలధరించుచుండు కౌ
మోదకినాఁదలిర్చుగద మోదశుభప్రతిపాదిగావుతన్ ౮

ఉ॥ చెందొవసూడుమేటి జిగిచెన్నునమిన్నరుచుల్ దళత్తళల్
గ్రందుకొనంగఁ గ్రొమ్మెఱుఁగుకై వడిఁజారువిభాభియుక్తిగో
విందుకరమ్మునం దసురవీరభయంకర లీలవెల్గు నా
నందకఖడ్గరాజము సనాతనసౌఖ్యఫలంబులీవుతన్ ౯

ఉ॥ జ్యాసముదగ్ర నిస్వనమహాస్తనితంబుల హేమవల్లికో
ల్లాసతటిల్లతాప్రతతులన్ జెనుపొంది శరప్రవర్ష వి
న్యాసమునన్ నిశాచరదవానల గర్వమడంచు శార్ఙ్గబా
ణాసననీరదంబు సకలార్థఫలంబులఁ బ్రోదిసేయుతన్ ౧౦

చ॥ అరయగ నంజనాద్రిశిఖరాగ్రముఁజేరి రహించుబాలభా
స్కరవరమండలస్ఫురణ గన్పడ మేచకగాత్రుఁడైన శ్రీ
హరిశిరమందునిల్చి సముదగ్రమణిద్యుతి పుంజరంజిత
స్థిరమహిమాభిరామమగు దివ్యకిరీటము సంస్మరించెదన్ ౧౧

చ॥ అలవుదలిర్పభక్తనిచయంబులు గోరెడుకోర్కెలెల్ల మే
ల్చెలువువహించివిన్నపము సేయుచునుండెడి నాఁగరత్నని
ర్మలరుచిరాజిఁబొల్పెసఁగి మాధవువీనులలంకరించు కుం
డలములు మాకభీష్టఫలదాన చమత్కృతిగల్గిపొల్చుతన్ ౧౨

ఉ॥ నీలఘనాఘనాంతిక వినిద్రతటిల్లతికాభిరామమై
లాలితమేచకద్యుతి కలాపజనార్దన దేహవల్లికన్
గ్రాలుచువింతకాంతులఁ జొకాటము మీఱుచునుండుబంగరున్
జేలచెఱంగుమాకు దయసేయునిరంతర సౌఖ్యసంపదల్ ౧౩

మ॥ మిత్రులందమ్ములఁ బ్రోచు నేఁచుకనులం మిట్టాడుచారుప్రభా
నివహంబొక్కఁట గ్రమ్మనర్థవిల సన్నిద్రాప్రబోధమ్ములన్
దవులన్ వేదరహస్యయుంకరణి వేధశ్చంచరీకాఖ్యమా
ధవనాభీజలజంబుగూర్చు నను మోదం బెప్డుమద్వాక్కులన్ ౧౪

క॥ తిన్నని నేత్రము గరమునఁ
జెన్నెసలారంగఁ గరుణఁజేకొని జగముల్
మన్ననఁగాచుచునుండెడు
వెన్నునిదళవాయిఁగొలుతు విష్వక్సేనున్ ౧౫

ఉ॥ కాలుమెఱుంగు తోడినవ కంబుగ్రొమ్మొయి లంసభాగమం
దారయనొప్పపేరునగ మట్టులఁగాంచనచేలుఁడైనకం
సారిని మాపునందిడి ప్రశస్తబలంబున సంచరించునా
గారిసుపర్ణుఁడిష్టఫలదైకని యాశ్రితలిర్చిపోషించుతన్. ౧౬

చ॥ అరయఁగ నిందనీల శకలాంచిత చారుకళంక భూషిత
స్ఫురదురు చంద్రమండలము పోలికఁ గృష్ణుని నైజభోగభా
సుర తరతల్ప సీమఁ గడుసొంపుదలిర్ప ధరించి పొల్చునా
యురగ విభుండనంతుఁడు మహోన్నతసంపదలిచ్చు మాకొగిన్ ౧౭

కం॥ మదిఁబ్రహ్లాదార్జుననా
రదశుక నాభాగ సుతపరాశరరుక్మాం
గదపుండరీక శౌనక
నదిసుత పారాశరులకు నతులొనరింతున్ ౧౮

శా॥ ఆమందాకినిఁ దెచ్చుటార్యగని రోషావిష్ట చిత్తాబ్జుడై
యేమంచున్ దలపోయునోయనుచునా యింతిన్ సముద్యజ్జటా
సీమందాచి నిగుంభసప్రివణుఁడై శీతాంశునిన్ మాటుగా
బ్రేమన్ దాల్చిన శంకరుండు సకలాభీష్టార్థము లొసగెడున్ ౧౯

ఉ॥ గట్టితనంబునీ మదినిగల్గునసంబనియేమి కొమ్మరో!
గట్టులరేని కూతురవు గావె యనన్ గయిఁ దాల్చినీవు పె
న్గట్టు గుణంబు గూర్చవగ కాఁదవు గావె యటంచు నీశుతో
జెట్టలు వల్కుగౌరి దయచేయును మాకఖిలార్థసిద్ధులన్ ౨౦

# ప్రథమాశ్వాసము

చ॥ తం తరుణీమణీముఖ సుధాకర కాంతులు సోకినన్ నిజా
సనము వికాసముం జెడి రజః ప్రభ నోల్పడునంచు శారదాం
బను వదనంబునందనిచి వారిజ పీఠి వెలుంగు పంకజా
సనుఁడు కృపారతిన్ సతము శాశ్వతసంపదలిచ్చి గాపుతన్ ౧

సీ॥ చేర్చుక్కఁగూడి రాజిల్లు జాబిలిరేక
జిలుగు వెన్నెలలతోఁ జెలువు మీఱ
నవతంసమందుఁ జెల్వగు నల్లకల్వక్రొం
జిగి ముంగురులఁగూడి చిందులాడ
తాటంకమణి ధగద్ధగితాంశురింఖోళి
గండభాగమునందు తాండవింప
నిటలభాగమునందు నెలకొన్న కస్తూరి
సోఁగనామము వింత సొగసులూర

గీ॥ సకల వేదోపనిషదగ్ర్య శాస్త్రనిచయ
మాకృతులు దాల్చి యాడిగమాచరింప
దళితసితపద్మ పీఠిపైఁ గొలువుదీఱు
పలుకు చెలి నాదు జిహ్వపై నిలుచుఁ గాత ౨

మ॥ చలితోదంచిత కర్ణజాత పవనాసాగమ్ములన్ ఘోరని
ష్ఠుల విఘ్నాచల సంచయంబు నలఁతిన్ దూలన్ క్రియన్ ద్రోచి భ
క్తుల కార్యమ్ముల సానుకూలముగఁ దోడ్తోఁ జేయు విఘ్నేశుఁ డి
మ్ముల నే వేళ నిరంతరాయ శుభముల్ బొందించు మత్కావ్యమున్ ౩

ఉ॥ తోయధిగోష్పదంబు క్రియఁ దోఁపఁ జివాలున దాటి లంకకున్
బోయి మహీజఁ గాంచి దితిపుత్రులఁ జెక్కడనుక్కడంచి య
త్యాయతశక్తి రావణు నహంకృతి డుల్చి జయంబు గొన్న యా
వాయుసుతుండు మాకు నిరవద్యశుభ ప్రతిపాదకావుతన్ ౪

కం॥ సాలంకాయన గోత్ర వి
శాల యశోనిలయు శంభుచరణసపర్యా
శీలుని మద్గురు మహితగు
ణాలయుఁ బాపయసుధీంద్రు నభినుతిఁ జేతున్ ౫

మ॥ అలఘుప్రజ్ఞం బరాత్మతత్వనిలయం బౌ బ్రహ్మమీమాంసకున్
లలి భాష్యంబొనరించి దుర్మతములన్ ఖండించి నిత్యంబుగా
వెలయన్ బ్రహ్మమతంబు నిల్పి త్రిజగద్విఖ్యాత మౌ కీర్తి భా
సిలు నద్వైత మతప్రవర్తకగురున్ శ్రీశంకరున్ గొల్చెదన్ ౨౭

క౦॥ కలితాత్రేయసగోత్రుని
జలజాసన సదృశ ధీవిశాలుని బుధ మం
డల వందనీయసుగుణో
జ్జ్వలు విద్యాగురుని ముత్తసత్కవిం గొలుతున్ ౨౮

సీ॥ వల్మీకభవు పాద వనజంబులకు మ్రొక్కి
సాత్యవతేయుని సంస్మరించి
కాళిదాసుని మనఃకమలంబు నందుంచి
దండిమహత్వంబు దఱచి తలంచి
భట్టబాణుని వచః ప్రాభవంబు గణించి
శ్రీహర్షకవితా విశేష మెన్ని
బిల్హణు వచన ప్రవీణత భావించి
భారవిపాండిత్య పటిమ నెంచి

గీ॥ నన్నపార్యునిఁ దిక్కనన్ శంభుదాసు
సోము శ్రీనాథుఁ బోతన నూరకవిని
పెద్దనార్యుని దలంచి కవిత్వగురుల
తక్కఁగల సంస్కృతాంధ్ర సత్కవులఁ గొలుతు ౨౯

వ॥ ఇట్లు యిష్టదేవతాగురువందనంబును సత్కవిజనాభినందనంబును గావించి శాశ్వతశ్రేయఃప్రదంబగు నొక్క మహాప్రబంధంబు రచియింపందలంచి తొలుత మద్వంశప్రకారంబుఁ దెలియం బఱచెద. 30

సీ॥ శ్రీశైలమునకు నంచితప్రాగుదగ్దిశ
మెఱయు గృష్ణాగౌతమీనదులకు
మధ్యభూమిని జనమాన్యమై తనరు కొ
ల్లేరు సరోవరతీరమునను

మహితగోకర్ణేశ మల్లేశశివపర
మానంద రాజలింగాహ్వయముల
భోగేశ్వరాఖ్యలఁ బొసఁగుమహాలింగ
పంచకాధిష్ఠిత భవ్యభూమిఁ

గీ॥ బరఁగుకలిదిండిసీమలో బహులసస్య
కలితబొమ్మినపాటి శాఖానగరము
నైతనర్చెడు సూర్యనారాయణాఖ్య
పురమొకఁడు వెల్గుసిరికిఁగాపురమనంగ 31

వ॥ అప్పురంబున 32

తే॥గీ॥ శ్రీమహావిష్ణు నాభిరాజీవముసను
జననమొందిన వేలుపుసకలభువన
సర్గనైసర్గికక్రియా నర్గళుండు
ధాతచెలువొందు సౌఖ్యసంధాతయగుచు 33

కం॥ ఆవేల్పుమోముదమ్మిని
పావనముగఁబుట్టి వసుధపైనంచిత వే
దావలికి తావునైతగి
వావిరివర్తించు బ్రహ్మవంశమునందున్ 34

సీ॥ పరమంత్రతంత్ర నిర్భరనిగూఢవ్యూహ
భేదనశూరులా ర్వ్యేలవారు
వేదోక్తకర్మప్రవీణ తాధారులై
వెలయుసుధీరులా ర్వ్యేలవారు
రాజకార్యైక నిర్వహణాసమానధీ
వినుతోపకారు లార్వ్యేలవారు
శారదాభండా రసారమంజులవచో
విమలవిహారు లార్వ్యేలవారు

గీ॥ సకలదిగ్విజిగీషు శశ్వత్ప్రభావ
శంకరాచార్య సాహాయ్యచారుకీర్తి
సహితులయినిత్యయోగ ప్రశస్తగతుల
వెలయుచుండు సుధీరులార్వ్యేలవారు 35

వ॥ అట్టి యాటువేల యోగివంశంబునందుని .. ౩౬

శా॥ సాలంకాయనగోత్ర విశ్రుతముగా సర్వోర్వరారాట్సభా
గ్రాలంకార గుణాఢ్యుడా నవిడవంశాంభోధిపూర్ణేందుడా
శ్రీలాలిత్యమునిూఱ దిశ్వాలభికాసీమన్ నిజోద్యద్యశో
జాలజ్యోత్స్న వెలుంగ సుబ్బయసుధీ చంద్రుండు రాజిల్లెడున్ ౩౭

వ॥ ఆగుణముల గని జగములు
బాగుగ వినుతింపఁగీర్తి బంధురుఁడగుచున్
రాగిలిసహ ధర్మిణిగను
నాగాంబారమణిఁ గొనియె నయగుణసరణిన్ ౩౮

ఉ॥ ఆరమణీమణి యైకమణియందుఁ జతుశ్శ్రుతులట్ల దివ్యదం
భోరుహగర్భునాస్యముల పోలికగాఁ బరుషార్థసత్ఫలో
దారకళా ప్రవీణమతి ధన్యులఁ బాపయ బాపయాఖ్యులన్
భూరిగుణాఢ్యుసాంబయను భోగయమంత్రినిగాంచె నల్వురన్ ౩౯

వ॥ అందగ్రజుండు ౪౦

ఉ॥ పాపయమంత్రి భవ్యగుణ భాసురసాధ్విలలామ సంతత
శ్రీపతిపూజనాభిరత సీతమయందు నిజాన్వవాయసం
దీపకులైన రామయసుధీ తిలకున్ గురురాజసద్గుణ
ప్రాపకు సుబ్బరాయుఁ గనెఁ బ్రౌఢిఁ ద్రివర్గఫలంబులో యనన్ ౪౧

వ॥ అందు ౪౨

సీ॥ కువలయామోదంబు గూర్చ పేర్మి వహించి
కళలకు నాస్థాన గరిమఁ గాంచి
విమలసువృత్తభావమునఁ దెల్విఁ దనర్చి
ఘనమార్గసంచార కలనఁ గూర్చి
విబుధాన్నదాన ప్రవీణత వెలయించి
యరిపాళిగర్వంబు లపనయించి
పటుతమోభేదన ప్రౌఢిమ సమకూర్చి
భూరిసత్కవిపాళిఁ బ్రోవఁ జేర్చి

## ప్రథమాశ్వాసము

సీ॥ సకలదిగ్వీధులను యశస్సాంద్రచంద్రి
కాకదంబము నెసకొల్పి ఘనతనిల్పి
యడవివంశపయోరాశి నవతరించి
నన్నెఁగ నెసుబ్బరాయుఁడై వాత్సకుండు

తే॥గీ॥ రమణఁబరమేశ్వరునకుఁ బార్వతియుఁబోలె
సతనికనురూపసాధ్వియై యశముగూర్చె
సతిశిరోమణి సమధికక్షాంతిధరణి
మహితసద్గుణనికురంబ - మాచమాంబ ౪౪

తే॥గీ॥ ఆవధూటీలలామను నందుసుబ్బ
రాయచంద్రుఁడుఁగనియెఁ బుత్రికులఁబాప
యాహ్వయుని రామశాస్త్ర్యాఖ్య నలఘువిద్య
యందువిజ్ఞానబోధంబు లందినట్లు ౪౫

సీ॥ సర్వజ్ఞుఁడగుచు నిచ్చలునొప్పు మేటి యా
ర్యానఘాలస్థితి నలరుటకుఁడె
యచలధర్మప్రియుండైన ధీరాత్ముఁడ
హీనగుణస్ఫూర్తి నెనయుటరుదె
వరసర్వమంగళా వాసుఁడైనఘనుండు
పరమవిభూతులఁ బ్రబలుటరుదె
రాజావతంసగౌరవముఁ గాంచువిభుండు
దుర్గాధిపత్యమొందుటయునరుదె

ఆ॥ యన నిరుపమానగౌరీశ్వ రాంఘ్రిపద్మ
యుగళసేవావశేషస మున్నఖాత్ముఁ
డై తదాత్మతనలరె నత్యంతభక్తి
మహితగుణశాలి పాపయామాత్యమౌళి. ౪౬

తే॥గీ॥ ఆసుగుణసాంద్రుఁడగు పాపయార్యమౌళి
చెలువుగను చుప్పలూరి నన్కులపయోధి
చంద్రుఁడగు రామలింగమంత్రీంద్రు కూర్మి
తనయ సీతాంబఁబత్నిగాఁ దావరించె. ౪౭

సాత్రాజితీ పరిణయము

సీ॥ చంచలత్వంబను సడివాయ వసుధపై
జనియించినట్టి శ్రీసతియనంగ
చండికాఖ్యఁదొలంగి సద్గుణశ్రేణితో
శోభిల్లు హిమనగ సుతయనంగ
బలునోళ్ళఁబడ్డ రచ్చల మాఱితనమెల్ల
వదలి నిల్చిన సరస్వతియనంగ
చలమించుకలేని బలుతాల్మి వహియించి
వెలసిన పంటల వెలఁదియనఁగ

గీ॥ మహితజనలోక సేవయౌ మాన నవ్య
దివ్యగుణరాశియనఁగ సత్కీర్తినొంది
యలరుఁబాపయమంత్రి యర్ధాంగలక్ష్మి
శ్రితసమగ్రదయాలంబ సీతమాంబ. ౪౮

కం॥ ఆమిథునమ్మునకు తప
శ్శ్రీమెఱయఁ జనించి సాంబశివనామునన్
ధీమహితసరసకవితా
సామగ్రిం గంటినద్రిజాపతికరుణన్ ౪౯

వ. ఇట్టి నేను ౫౦

ఉ॥ గౌరవమొప్ప యాదవశిఖామణి పాదసరోజయుగ్మమిం
పారఁ మనంబు నన్నిలిపి యచ్చపుభక్తి భజించి తత్కృపా
సారసుధాప్రవాహ పటుశక్తిఁ గవిత్వ మహత్త్వయుక్తి నిం
డారఁ దదీయ దివ్యచరితార్ణవ వర్ణన మాచరించెదన్ ౫౧

ఉ॥ సారసగర్భ ముఖ్యదివిషన్నికురంబము లేని ఘానికన్
పారమునొందనెవ్వని శుభస్థిర సత్కథలెన్న నేతరా
శౌరి కథాప్రపంచము వచశ్చటిమన్ వినుతింపవచ్చునే
నేరిచినంత పట్టున నిశ్చలభక్తి రచింతు తత్కృపన్ ౫౨

ఉ॥ భాగవతంబటంచును గృపానిధిసాత్యవతేయుఁ డొప్పిలో
లోగణితోపకారమతి నచ్యుత దివ్యకథాప్రపంచమున్

బాగుగ నుండఁగన్ దెలియఁ బల్కెఁ దదీయ మహాపురాణ సం
యోగము నీషులై విబుధులూర్జితభక్తిరసంబుఁ గ్రోలఁగన్ ౫౩

ఉ॥ అట్టి మహాపురాణమున నచ్యుతుఁ డచ్ఛపతిన్ జయించి తా
నెట్టన నా స్యమంతకమణిన్ గొని తెచ్చుట సత్యభామఁ జే
పట్టుట రెంటన్ కథల్ నుతికిఁ బాత్రములై వెలుఁగొందు గాన ని
ప్పట్టున వానినే యొక ప్రబంధముగా రచియింపఁ బూనితిన్ ౫౪

చ॥ హరిశుభచర్యలెల్ల నరయంగఁ బురాణములందు సత్కవీ
శ్వరులు యథార్థవైఖరిని వర్ణనచేయ మహాంధ్రకావ్యముల్
విరచన సేయనేల యని చింతనఁ జూడకుఁడీ బుధోత్తముల్
వరదుని లీల లెవ్వరెటు వర్ణనజేసిన మెప్పుఁ గొందదే ౫౫

ఉ॥ పెక్కుభవంబులందు వృజినేతర జన్మము గాంచి పుణ్య స
మ్యక్కలనన్ గవిత్వగరిమన్ గడియించి కుమార్గసంగతిన్
జిక్కక వాసుదేవుని ప్రసిద్ధ విశుద్ధ కథార్థవర్ణనన్
జొక్కుట కర్హనేని జని చూడఁ గృతార్థత నొందకుందునే ౫౬

మ॥ మనుభూపాలురు సత్కవిప్రకరముల్ బూజించి యిష్టార్థముల్
దనివారంగ నొసంగి మన్ననఁ బ్రబంధమ్ముల్ రచింపించిరి
ష్ఠనయంబున్ బరదేశభూరమణ రాజ్యంబందుఁ బ్రోత్సాహమున్
గనలేకున్న యెడన్ ప్రబంధరచనం గావింపఁగా శక్యమే ౫౭

చ॥ జనపతులెందు వర్ణనలు సల్పమి జీవనవృత్తులొక్కెడన్
గనమి యజస్రమున్ గడుపుకక్కటితిన్ నృపసేవ సేయఁగాఁ
జని కడిదేశభాషలను వైదుషి యించుక లేక యున్నచో
కని కృతి సేయువారు నదిగన్గొని మెచ్చెడువారు నుందురే ౫౮

మ॥ తలఁపన్ దేశము హూణరాజ్యమయి తద్భాషాపరిజ్ఞానకౌ
శలమే పూజ్యతఁ గాంచుచుండు నెడ నిచ్చల్ హూణవిద్యారతిన్
గలరెవ్వేలు బదేలు మిక్కుటముగాఁ గన్ దేశభాషావిదుల్
గలరే? కల్గిన మెచ్చువారు గలరే? కావ్యంబులింకేటికిన్ ౫౯

తే॥గీ॥ ఐననెప్పటికైన దేశాభిమాను
లెందుగలుగరె కలిగిన నెంచికృతులఁ
జదువరేయను బుద్ధినిశ్చయము తోడఁ
గడఁకఁ గృతియిట్లు రచియింపఁ గడఁగినాఁడ ౬౧

ఉ॥ శౌరినివాఁడకృష్ణుఁడ ననిందితవైనుష లేదు గోపికా
జారకృపాకటాక్ష కలసద్గతిఁ గావ్యముసేయఁగంటి నిం
దేరహినైనఁ దప్పులొకయించుక కల్గిననైనహంసముల్
నీరొదలించి పాలుగొను నేర్పునఁ బండితులాదరింపుడీ ౬౨

చ॥ రమణదలిర్పఁగానిహ పరంబులయందు ననింద్యతోరుభా
గ్యములనొసంగఁజాలిన మహాకృతినిట్లు రచింపఁగంటె జ
న్మముచరితార్థమయ్యె గరమంబుననీకృతి నేమహామహో
త్తమునకు నంకితంబుగనిడందగునో యనియెంచుచుండఁగ ౬౩

చ॥ కలియుగమందుమానవనికాయముఁ బ్రోవఁగనెంచి దేవతా
తిలకమనంగ శేషుఁడు దీర్ణమహామహిమాఢ్యపన్నగా
చలశిఖరాంగణంబున నచంచలవైఖరినిల్చి సత్కృపా
విలసితభావముల్ దెలుపు వేంకటనాయక నామధేయుఁడై ౬౪

చ॥ వసుధజనాళికెల్ల గొలువంగలవేలుపు పన్నగాచలా
వసథ నివాసుఁడైన సురవంద్యుఁడు వేంకటనాథుఁ డొక్కఁడే
విసువక యాతఁడాశ్రితుల వేడెడుకోర్కులనిచ్చి ప్రోవ సం
తసమునదానకంకణముదాల్చె జగజ్జనవంద్యమానుఁడై ౬౫

మ॥ అంకిలిదీఱచిదాసుల
సంకల్పములొసఁగ ప్రోవఁ జాలునఁటు" కలౌ
వేంకటనాయక" యనుచుని
రంకుశగతి విబుధజనము లభినందింపన్ ౬౬

వ॥ కావున నీకృతికి లోకోత్తరుండైన శ్రీవేంకటరమణుండె రమణుండగుం తగునని యూహించి తదీయచారణారవిందంబులు నాహృదయంబున నెలకొలిపి యకారుణాకరుని మత్కృతికి నధిపతిం జేయఁబూనితి గావున

చ జగదభినంద్యమైనయదు సత్త్వమదివ్యకథాప్రబంధమా
ర గనగ నాయకాంకిత విరాజితమైకడునొప్పు మేల్గిల్గ
దగునపరంజిసొమ్ము వితతద్యుతిరంజిత పద్మరాగ ర
త్నగతినిమించునట్లు విబుధప్రకరంబునకెల్ల హృద్యమై ౬౭

వ అట్లుగావున నేతత్ప్రబంధబంధురావ్యాజ రక్షణవిచక్షణుండగు శ్రీవేంకట నాయకుం డెట్టివాఁడనిన.

సీ॥ ప్రత్యూషవికసిత రాజీవదళచారు
చక్షువుల్కారుణ్యరసంబుఁజిలుకఁ
దిరుమణి తిరుచూర్ణ విరచితతిలకంబు
నెమ్మొగమ్మునకొక్క నిండుచూప
శతకోటిచంద్ర భాస్కరబింబదీధితిఁ
గరముల శంఖచక్రములు వెలుఁగ
సజలవలాహకాం చత్తటిల్లతవోలె
నెమ్మేన గనకాంబ రమ్ముగ్రాల

గీ॥ నింద్రనీలంబునిరుగెడ నెనయుహొన్ను
బంగరుసలాకలనఁ బార్శ్వభాగములను
గలిమిచెలిపంటవలఁతియు నిలిచికొలువ
నింపుదళుకొత్తు శ్రీవేంకటేశ్వరుండు ౬౮

షష్ఠ్యంతములు

కం ఏవంవిధశుభదర్శన
భావుకునకుఁ ద్రిజగదవన భాసురకరుణా
శ్రీవిభవునకు భుజంగ
గ్రావసమంచిత శిఖాస్ఫురద్భవనునకున్ ౭౦

కం॥ తిరుమణి తిరుచూర్ణకృత
ప్రరుచిరరేఖోర్ధ్వపుండ్ర భాసురనిటలాం
తరతాండవితకిరీట
స్ఫురదంబుజరాగరత్న శుభకిరణునకున్ ౭౧

కం వరకామోదకినందక
సరసీరుహశంఖచక్ర శార్ఙ్గవిరాజ
ద్గురుకంకణ మణికిరణ
స్ఫురిత చతుర్బాహునకును శుభదేహునకున్ ౨౨

కం॥ శేషాచలశిఖరాగ్ర వి
శేషాయితభవనకృత ప్రసిద్ధనివాసా
శేషప్రమోదలీలా
వేషునకున్ సతతవిబుధ విభుపోషునకున్ ౨౩

కం॥ అలమేలు మంగమాహృ
జ్జలజవికాసప్రధాన చాతుర్యసము
జ్జ్వలకోటి భానుబింబా
త్యలఘుతరద్యుతికి వేంకటాచలపతికిన్ ౨౪

వ॥ సభక్తి తాత్పర్యంబున బహుసహస్ర నమస్కారంబు లాచరించి తత్సమర్ప
ణంబు గా నాయొనర్పంబూనిన సాత్రాజితీపరిణయంబను శృంగారకావ్యకథావిధా
నంబు నతనికి విన్నపంబు సేయు తెరంగాచరింప నద్దేవదేవుని నాహృదయ పుండరీ
కంబునఁదివసింపంజేసి పెన్నిధియగుఁ తనసన్నిధింగల్పించు కొనియిట్లని విన్నవింతు.

కథారంభము

కం॥ శ్రీ మదలమేలుమంగా
ప్రేమాంచితనర్మ వచన మృదుతరరచనా
సామర్థ్య జనితనిజహృద
యామోదాభరణ వేంకటాచలరమణా ౨౫

వ॥ అవధరింపుము తొల్లిపరీక్షున్నరేంద్రుండు గోవింద చరణారవింద
మిళిందాయమాన మానసుండై శుకయోగీంద్రునివలన
భాగవతపురాణ రాజంబాకర్ణించునెడ. ౨౬

కం॥ సత్రాజిత్సుతనూజ
మైత్రింగొని తన్నిబద్దైత్య మర్దనునకు సం

సూత్రితాఘగుభక్తిఁదగఁగ
క్షేత్రముగాఁ జేయుటెల్ల లాలితఫణితిన్ ౭౮

క॥ వినుపించు మనుచు వేఁడిన
ననఘుఁ బరీక్షిత్తుఁ బ్రశాంతు హరిపద సేవా
ధీనుతమనస్కుఁ గనియిటు
లనియెన్ శుక యోగిసంతతానందమునన్ ౭౯

క॥ పావనములు బుధజనసం
భావనము లనంతభక్తి భవతాత్మకని
త్యావనములు శ్రీహరిపద
సేవనములు కోరి వినుతి సేయందరమే ౮౦

క॥ స్ఫురితంబులు గతసేవక
దురితంబులు మంగళైక ధూర్వహగుణసం
భరితంబులు శ్రీకృష్ణుని
చరితంబులు వినుతి సేయ శక్యమె తెలియన్ ౮౧

క॥ శ్రీహరిదివ్యకథా సం
దోహము సాంద్రరసము కొలుకఁగ భక్త
వ్యూహములు వినుతి సేయఁగ
దేహము పీయూష జలధిఁ దేలుబుధవరున్ ౮౨

క॥ ఆపదలెల్లను మాన్పఁగఁ
బ్రాపయి సంపదల నొసఁగ భాసుర మోక్ష
శ్రీపదవిఁ గూర్పఁ జాలును
శ్రీపతి చరితములు వినుతి సేయు మనుజకున్ ౮౩

ఉ॥ కావున నీ కనన్యమతిఁ గైకొని వేడుక నాలకించు మీ
దేవశరణ్యుఁడైన వసుదేవకుమారుని దివ్యసత్కథా
శ్రీవిభవంబుఁ బెంపొనరఁ జెప్పెద జిత్తము సంతసింపఁగా
దేవనదీప్రవాహ సము దీర్ఘతరంగఘుమంఘుమధ్వనిన్ ౮౪

వ. అని చెప్పి సకలసజ్జనపాలునకు శుకయోగీంద్రుండిట్లనియె ౮౫

ఆ.వె. అవనిఁ గశ్వరహింపు నమరావతీపురి
భోగవతియుఁ దనకుఁ బోల్పఁ బాటి
కాఁగ నవ్యరత్న కాంచనావళులకుఁ
గాపురంబు ద్వారకాపురంబు ౧౬

చ॥ జలనిధి పుట్టినిల్లగుటఁ బర్విసుచందముఁ బొంది భజింపఁ గాంచనో
జ్జ్వలవరణాభిరామము ప్రశస్త మహామణిసౌధపఙ్క్త్యా
వళికలితంబునై భువనవర్ణితవైభవమింపు మీఱఁగన్
వలనగు సాటిలేని చెలువంబున ద్వారవతీ పురంబిలన్ ౧౭

ఉ॥ సాలశిఖాగ్రభాగపరిసర్పిత కాంచనకుంభకుంభిశో
ద్వేలమణి ప్రరోహ సముదీర్ణమనోజ్ఞమరీచి జాలముల్
ప్రాలుచు నెంతయున్ దివము గప్పిన నచ్చోటు నేఁగఁ గాంచి ధీ
రాళులు చిత్రభానుఁడను నాఖ్యవహించిరి కర్మసాక్షికిన్ ౧౮

మ॥ వరుణస్థాపిత భూరిహారమణిదీప్యద్దీప్తిరింఛోళికం
తరమెల్లం గలయంగఁ బర్విన సముద్యచ్ఛ్రీతాభ్రాజియై
పరిఘాంభోనిధి పాలసంద్రముగతిన్ భాసిల్ల వైకుంఠ మం
దిరమై చెలువొందు నాపురము నిర్నిద్రప్రభాశోభియై॥ ౧౯

మ. మణిసౌధాంతర సంచరన్మదవతీ మాణిక్యవీణాకల
క్వణనానూన సుగాన వైఖరికి స్వర్గంగా తరంగాంతర
క్వణదుద్దీప్త రథాంగ వాసిత ఝుణత్కారంబు సన్యకల్పశో
ల్బణతాళస్ఫురణంబు జూపు నభయప్రాగ్భూణ్యగణ్యంబుగన్ ౨౦

సీ. రాజరత్నవిహార రమణీయతలు గాఁగ
రాజరత్నవిహార రమణమీఱె
కమలాను మోద సంకలితాంతరము నాటఁ
గమలానుమోద సంకలనమించె
నవ్యప్రవాళ సౌందర్యధుర్యము తోఁట
నవ్యప్రవాళ సుందరములయ్యె
కమనీయ జాలక కలితగర్భము తోటఁ
గమనీయజాలక కలనగాంచె

గీ. వసంగ నతిలోక రమణీయతాభి వినుత
నిత్యకల్యాణ వైభవోన్నిద్రగరిమఁ
గలితకాంచన నవరత్న కళలఁజాల
నమరు నాగపురిమణి మండితాలయములు. ౯౧

సీ. చెలియ యాడించి నట్టుల నాడఁచుండెడె
సురవృద్ధు మెచ్చరు ధరణిసురలు
గతిఁ కిచ్చిన మాట నెఱవేర్పనోడిన
భృగురాము దలఁపరు పృధివిపతులు
నిధులునర్ధులుఁ నట్టి విధ మెఱుంగక దాఁచు
నలనికేశ్వరు నెంచరర్య జనులు
మతధర్మమును వీడి మద్యపానముఁ జేయు
బలుని గొండాడరు పాదభవులు

గీ|| అలఘుమతి వేదములఁ జెప్పఁగలిగియుంట
బ్రతినఁ జెల్లింప భంగము పడకయుంట
నేర్పుమై నవనిధుల గణించుచుంట
దమకులాచారధర్మముల్ దప్పకుంట ౯౨

చ అలవికి మీఱు శౌర్య రసమందుఁ బ్రతాపము గూర్చి ధైర్యసం
కలన మొనర్చి నేర్చియొడికంబుగఁ బద్మభవుండొనర్చె నా
నలఘుపరాక్రమక్రమ మహాద్భుత వీరభట ప్రకాండముల్
మెలఁగుదు రప్పురంబున నమేయ బలస్ఫురణానుభావులై ౯౩

చ గగన తరంగిణీకలిత కమ్రసరోరుహ పంకముఖ్యము
త్స్వగురు కరాగ్రకుంచికలఁ బట్టి తెమల్చికట్టనవన్మదో
పగతమధు వ్రతప్రతతిఁ బాయఁగఁ దోలు బురంబునంజల
స్సగము లనంగఁ జాలిమదనాగ కదంబము లద్భుతంబుగన్ ౯౪

సీ|| చిత్రసేనానంగ ప్రసిద్ధిఁ గాంచినచోట
గంధర్వవిఖ్యాతి గలుగుటరుదె
మహనీయమహాదేవ మణివహించినచోట
గంఠాభరణయుక్తి గలుగుటరుదె

దీప్తశుభధుర్యవస్థితి గల్గుచోసదా
　　　నక్షత్రయోగ్యగుణంబు నరుదె
పురుషోత్తమామోద కరగతుల్గలచోట
　　　దాక్షాయభిధానసంధానమరుదె

తే॥ యనఁగ భువనోన్నత ప్రభావాఢ్యజనన
ధాటికాధిక కృతాబ్జబాంధవహయములు
నగుచు సంపూర్ణధారామహత్వమొందుఁ
జాలనా పురివిలసిల్లు సైంధవములు. ౯౫

చ॥ లలితతిలోకవిభ్రమవిలాస పరిష్కృతలైనతత్పురీ
లలనలయందముల్గనఁ దలంచి సమున్నత సౌధపాళిచెం
తలఁబడియేగు నిర్జరనితంబినులబ్బురమొంది మాన్పడన్
నిలుతురు చందురాపతిమ నిల్కడఁ దమయున్కి మార్పడన్. ౯౬

సీ॥ కొమ్మనీ వైవండఁ గోరెదవో సఁగ వే
　　　చేఁజాచియడుగ నిచ్చెదరె యుఱక
లలన యీగుబ్బబంతులు చేతికింపగుఁ
　　　జేపట్టకేరీతిఁ జెప్పవచ్చు
రమణి యీచివురు పొట్లము నానసీయవే
　　　పలుమఱింతగనోక వలయకందు
పొలఁతి యీవిరిపొన్న పూవుఁ జూడఁగనిమ్ము
　　　నీవివీడక నెట్లునీకుదక్కు

తే॥ ననుచు నెఱజవ్వనంపు సోయగపు విటుల
చిత్తములఁగొడెపలుకుల గుత్తగొనుచుఁ
గులుకుసాయంపు చక్కని కలికిబోంట్లు
పూవులమ్ముదురవ్వీట వీవి మెఱసి. ౯౭

చ॥ సలలితకాంచనాంబురుహ షండసమంచిత చారుదీర్ఘికా
వళులననారతంబుఁగృతవాసములై తగు రాజహంసముల్
హాళహళినొంది నవ్య జలదాగమముక్ దిలకించియున్ మఱిన్
దలఁపవు మానసంబుఁ దదుదారసుఖానుభవప్రమత్తతన్. ౯౮

మ॥ జలకేళీరసలోల సాబ్జవదనా చారుస్తనాభోగ పి
చ్ఛిలకాశ్మీర మృగీమదద్రవపరిస్ఫీతోల్లసత్సౌరభా
కలనం గాంచు గొలంకునీట వెలుఁగం గాఁదచ్ఛరీ శాలిసం
కులముల్దద్వరగంధ బంధురములై కూర్చున్ మనోజ్ఞత్వమున్. ౯౯

చ॥ ఎలమిని నంజచేల తవణించెడు చిక్కని రాజనంపు టె
న్నులుఁగొననేఁగుదెంచిన మనోజ్ఞశుకావళి శాలిపాలికల్
పలుమఱుఁ జోపనెల్గుపసలన్ దమజాతియటంచుఁ జేరి సొం
పులొలుకు మోవి ఓంబమను పూన్కిఁ గొనంజను వారలుల్కఁగన్ ౧౦౦

క॥ ఈరీతిని ననితరసా
ధారణసౌభాగ్యరమకు ధామంబై శృం
గార రచనాచమత్కృతి
నారయ సురపురికి నధికమైకనుపట్టున్ ౧౦౧

ఉ॥ ఆపురమేలు మేలుభళియంచు జగంబులు సన్నుతింప శో
భాపరిభూతుఁడౌచును నభమ్మనమిత్రుఁడు మిత్రభావమున్
జూపనవక్రవిక్రమ వినోదనిరస్త నిలింపశత్రుఁడై
శ్రీపతియంశమై యవతరించిన కృష్ణుఁడలంకరిష్ణుఁడై ౧౦౨

మ॥ ధరణీభారభవిష్ణు రాత్రిచరవిధ్వంసంబు గాంక్షించి శ్రీ
హరిపూర్ణాంశముబూని యాదవకులై కాలంక్రియా ధుర్యతా
స్ఫురణం దా వసుదేవ పుత్రుఁడగుచున్ బొల్పొంద నేమంగళా
చరణుండా పురుషోత్తముండు త్రిజగత్సంపూజ్యుఁడై వర్తిలెన్ ౧౦౩

చ॥ ఎఱబఱకంబులేని దివిజేంద్రుని భవ్యమహాశుధర్మ న
క్కఱఁగొని తెచ్చి యోలగముఁగా తవణించి కుబేరు అొక్కఁపున్
గుఱుకులు చేయలంతులుగఁ గూర్చినకృష్ణుని ప్రాపుకల్మినే
కొఱఁతలు గల్గునే వసుధకుందొడవై తగు నప్పురంబునన్ ౧౦౪

ఆ॥వె॥ అఖిలలోకవిభుఁడు హరిలీలచేమను
జాకృతినిధరించి యదుకులమున
వెలసెననఁగనతని విమలకల్యాణగు
ణౌఘ మేల వేఱ నభినుతింప ౧౦౫

చ॥ అనిమిషనాథు మెచ్చుసభ యైనసుధర్మని జానుభూతికిన్
బనివడగోష్ఠినుండుచు నపారకుబేర నిధిప్రతానముల్
దని:గవెచ్చఁబెట్టుచు సదా హరి ప్రాపునఁజేరియాదవుల్
దనరిరి పూర్ణభోగమున దైవతకోటిఁదిరస్కరింపుచున్ ౧౦౬

కం అతిదుర్మదుఁడగుకంసుని
మతమునఁబడుదోసఁగులెల్ల మఱచిరి కంసా
హితుఁడైనవాసుదేవుని
హితపాలనసుఖము లనుభవించెదు పేర్మిన్ ౧౦౭

వ॥ ఇవ్విధంబున సర్వలోకేశ్వరుండు ప్రవర్ధిత నిజప్రజానురంజకుండగుచుఁ బాలింప ద్వారవతీపురంబు సకలసంపదలకాకరంబై విలసిల్లుచుండె నట్లుండునెడ. ౧౦౮

కం॥ ఆపురిసత్రాజిత్తను
భూపతి యంధకకులైకభూషణుఁడనఁగాఁ
గాఁపుండియతఁడపూర్వ
శ్రీపరిణతిఁ గోరి తపము సేయన్ దలఁచెన్ ౧౦౯

చ॥ మునుకొనిమూడుమూర్తులకు మూలపటంచు శ్రుతుల్ దృఢంబుగాఁ
బనివడిచెప్పె నేయపరిభావమహోనిధి నాజగత్త్రయీ
ప్రణుతచరిత్రు వేదమయు భాస్కరునిన్ ఘనసైక దీసకున్
మనమున నిల్పిచేసె జనమాన్యుఁడతండు తపంబునిష్ఠతోన్ ౧౧౦

శా॥ పాదాంగుష్ఠము నేల మోపి పవనున్ బంధించి పంచేంద్రియో
న్మాదంబున్ బెడవాపి చిత్తమున దుర్మాలిన్యరాహిత్యమున్
గాదండించియపారనిష్ఠ నెలవై పంచాగ్నిమధ్యస్థుఁడై
యాదిత్యుందృఢదృష్టిఁగాంచుచుఁ దపోవ్యాపార పారీణుఁడై ౧౧౧

కం॥ నియతినిజేంద్రియచయము వి
షయవైముఖ్యంబుఁగాంచ సమధికనిష్ఠా
శ్రయమైచిత్తముగను ని
శ్చయ మొందనతండు తపము సలిపెనచలుఁడై ౧౧౨

తే॥గీ॥ సకలభూతములందు నిష్ఠాసవృద్ధి
నాత్మరూపకుఁగా నింద్రియప్రచోద
కత్వభూర్భువఁగాఁ బ్రభాకరునిఁగాంచి
తానదంన్మయుఁడైయుండెఁ దపసుపేర్మి ౧౧౩

తే॥గీ॥ అట్టి పరమఁగ్రతోదగ్రమగుతపంబు
కలిమికిఁబ్రహృష్టచిత్తుఁడై నలినహితుఁడు
సౌమ్యవేషంబు నమలతేజంబు మెఱయ
నతనిముందట నప్డుప్రత్యక్షమయ్యె ౧౧౪

తే॥గీ॥ అట్లుప్రత్యక్షమైన లోకైకదీప
కునిఁద్రయీమయు మార్తాండుఁగని యుదీర్ణ
విగళితానంద బాష్పుఁడై వితతపులకి
తాంగుఁడైభక్తియుక్తినిట్లభినుతించె ౧౧౫

శిఖరిణీ నమోస్తుబ్రధ్నాయ శ్రుతి విహితమూర్తిత్రయమయ
ప్రమాణాకారాయ ప్రచురకరుణావారినిధయే
నసుస్తాధారాయాంధతమసభిదే విశ్వవిభవే
నమస్ఫక్తాభీష్ట ప్రదవిహితదీక్షాయభవతే ౧౧౬

శా॥ పాదైనీదురజోగుణంబు సృజియింపన్ విశ్వముఁ బరక్షణా
పాదిత్వంబు వహింప సత్వము దమోభావంబుఖండింపఁగా
నాదిన్ బ్రహ్మమురుఁ విష్ణుఁడున్ శివుఁడునై యుండఁగాఁ జమ్మనా
నాదిత్య శ్రుతినీవఁబ్రహ్మయని నిత్యంబున్ బ్రబోధించెడున్ ౧౧౭

చ॥ గరిమఁదపింపఁజేసి యుదకంబుకరంబులఁ బీల్చిమబ్బునం
బరఁగియువృష్టిరూపమున నిచ్చుచు నోషధికోటిఁ జంద్రునం
దరనయి ప్రోచి యున్నమిడి యేర్పడఁగాలము లెక్కజూపుది
ట్టరయఁగ సర్వరక్షణలయంబుల కీశుఁడవీవభాస్కరా. ౧౧౮

మ॥ అనఘన్యాహృతి సప్తకాశ్వయ వాహ్యాంచత్త్రియీసారతా
ఘనగాయత్రిమహామను ప్రవరసంగస్పంద నాఘస్థిత
ప్రణవాకార సుసిరసంగత పరబ్రహ్మాత్మ తేజంబవీ
వనివేషంబులుపల్కుసర్వభువనైకాధార సర్వేశ్వరా. ౧౧౯

ఉ॥ ఎయ్యది వేదమాతయన నెల్లశ్రుతుల్ దవణించు సారమా
నెయ్యది యాత్మతత్త్వవిధ మేర్పడఁ దానయి తెల్పుచుండు మ
న్నెయ్యది బ్రాహ్మణత్వము జపించు జనంబుల కిచ్చుచుండు దా
నయ్యతిభవ్యమౌ మనువు నర్థము సర్వము నీవ భాస్కరా. ౧౦౦

తే.గీ॥ ప్రాహ్ణమున బ్రహ్మ వౌచు మధ్యాహ్నమందు
త్ర్యంబకుఁడ వౌచు మతియు సాయాహ్నమందు
విష్ణుఁడవునౌచు నీవు త్రివిధమహా
యుక్తి లోకార్చితుఁడ వౌదు వోదినేశ. ౧౦౧

శా॥ ఏనీ తేజముఁ గాంచి యంత భువనంబెల్లన్ స్వకర్మానుసం
ధానస్ఫూర్తిమఁ గాంచి చేతనక శాధామంబుఁ గాఁదోఁచు నో
యానిత్యాద్వైత యాత్మరూప భవనీ యుష్మత్తేజంబు స
ర్వానుస్యూతపరాత్మ తత్త్వమని వేదాంతంబులాడుం రవీ! ౧౦౨

చ॥ అనుపమ సుక్రతువ్రాతముగ నగ్నులఁ వేల్చిన హవ్యముల్ త్రయీ
తనుఁడగు కర్మసాక్షి నినుఁ దప్పక చేరు భవన్మయూఖముల్
విసమయవృత్తితో నొసఁగు వృష్టియటన్ జనియించు నన్నము
ద్దనగు భూతసర్గము గనుంగొనఁగాఁ గణమీవయింతకున్ ౧౦౩

క॥ ఆరయ సత్యమునకు నా
ధారము నీవ పరమార్థతత్త్వము సత్యా
కారము కావున నద్రయ్యం
తారూఢంబయిన తత్త్వమది నీవకదా ౧౦౪

మ॥ పరమోదార హిరణ్మయాంచిత తనుస్ఫురత్ స్ఫూర్తి దేవోమయ
స్ఫురణాకారముఁ గాంచు నీవ పరమంచుం బలుకుం ఛాందోగ్యమున్
దరయుం గానిగమాంతసారకలితంబౌ నంతరాదిత్యత
త్త్వరహస్యార్థము రూఢిఁ దెల్పెఁ బరతత్త్వంబీవ కా భాస్కరా. ౧౦౫

కం॥ పరతత్త్వము సచ్చిత్సుఖ
నిరతిశయజ్యోతియును వినిర్మలమగుచున్
బరగు భవదాత్మకంబై
పరమజ్యోతిస్స్వరూప భాస్కరమూర్తీ. ౧౦౬

చ॥ సకలజగత్ప్రకాండమును సర్గమురక్షణమున్ లయంబు శా
యకరయొనరించుచుండ్ నిరుపమాద్భుత తేజము గల్గివెల్గునీ
యకలుషమూర్తి బ్రహ్మమగు నంచు శ్రుతుల్ వచియించనెంచలే
. కకట యదృశ్యమంచుఁ బగమార్గము వేఱ తలంచ నేటికిన్ ౧౨౭

శా॥ నీవే బ్రహ్మవు నీవయచ్యుతుఁడ వీవేమహేశుండవున్
నీవేయింద్రుఁడ వీవ దేవదనుజా నీకంబుమర్త్యాళియున్
నీవేసర్వచరాచరప్రకరముల్ నీవేయజాండంబులున్
నీవేసర్వము లేవు నీకితరముల్ నిత్యానుకంపానిధీ ౧౨౮

శా॥ భానూ భాస్కరవేదరూపక జగద్బంధూ త్రిమూర్త్యాత్మకా
నానాలోకచయప్రదీప మహితానందస్వరూపా సదా
జ్ఞానప్రాంచిత సత్యనిర్మలగుణా సర్వైకసాక్షీదయా
ధీనా భక్తజనావనా దినమణీ దేవా ననుం బ్రోవవే ౧౨౯

కం॥ ఎఱుఁగని వారికి దినమణి
వెఱఁగిన వారలకు సకలహేతువుదానై
వఱలెదు పరతత్వము నీ
వఱిముఱి నీ కఱద లెఱుఁగ వగునే మాకున్ ౧౩౦

తే॥గీ॥ శరణు భాస్కర దుష్కృత చయవిదూర
శరణు మార్తాండ మహిత తేజః ప్రచండ
శరణు దిననాథ భక్త్య యశస్సనాథ
కరుణఁ జూడుము జగన్నేత్ర కమలమిత్ర ౧౩౧

చ॥ అనిబహుభంగులన్ బొగడునావృపముఖ్యునిఁ జూచి మెచ్చుచు
న్మనమునిరూఢ భూరికరుణారసపూరముగాఁగ జేర్మి న
య్యినుఁడుప్రసన్నుఁడైయనియె నిచ్చెదఁగోరుము నీయభీష్టముల్
ననిశితమైననీతపము నూవె ప్రియంబొనరించె నాకిఁకన్ ౧౩౨

కం॥ అనిపలుకు ప్రావృడాగమ
ఘనరవముంబోలి కడువికాసముహృదయం
బునబట్టి కిఁ గూర్పఁగఁగనుఁ
గొనల ముదశ్రుపులు గుబులు కొనననిట్లనియెన్ ౧౩౩

కం॥ దేవా నీవు ప్రసన్నుఁడ
వై వరముం గోరుమనుచు వచియించితి విం
కేవియు నేటికి నిదికా
దే వరమనదీనికధిక మెద్దియుఁ గలదే ౧౩౪

కం॥ నీవు ప్రసన్నుఁడవైనను
నీవిశ్వమునందలభ్య మెందును గలదే
దేవాదిదేవ సకల శు
భావిష్కృతి నీదుకరుణ యని తలఁతుఁజుమీ ౧౩౫

కం ఆరోగ్య మరిజయంబు న
పారంబగు సంపదయును బడయఁగవచ్చున్
ధీరమతిఁగూర్చి నీచర
ణారాధననిష్ఠుఁడైన యట్టి నరునకున్ ౧౩౬

కం అధిక మహిమాఢ్యుఁడవు నిర
వధికం బైమించునట్టి భాగ్యము నాకున్
బుధులదయ నొసఁగు వేడెద
బుధవందిత సర్వలోక పూజిత సవితా! ౧౩౭

వ అనియభ్యర్థించిన భక్తాభీష్ట వరప్రదాన చాతురీనిత్యం
డగు నాదిత్యుండు వానికిట్లనియె ౧౩౮

కం కలదు స్యమంత మనంగా
నలఘుతరంబైన రత్నమదియిచ్చెద ని
చ్చలు నీవు భారవింశతి
కలిత సువర్ణంబు నొసఁగఁ గలదది ప్రేమన్ ౧౩౯

కం ఆరత్నము ధరియించిన
భూరమణులలోన నీవు పూజ్యుఁడవై పెం
పారెదు నీయింట మహో
దారంబై కాంచనంబు తొలుఁగకయుండున్ ౧౪౦

వ అని చెప్పి ౧౪౧

కం॥ అనులద్యుతి జాలజటా
లమరుచు లలినాత్మ మండలముఁ బోలుచు ది
వ్యమహిమఁ బూజ్యమ్మయి తగు
స్యమంతమణి నొసఁగెఁ బ్రియమెసఁగ నాతనికిన్ ౧౪౨

వ ఇట్లు జగదేక పూజ్యంబగు స్యమంతకమణి నొసంగి దివసమ
ణియంతర్ధానంబు చేసిన సాత్రాజిత్తు నతిలోక ప్రభావంబగు న
మ్మణిని ధరించి తదీయ విస్ఫురత్తేజః ప్రసారంబునం జేసి నభో
మధ్య విద్యోతమాన ఖద్యోత మండలంబును గేలిసేయుచుఁ
బరిహృష్టాంతరంగుండగుచు నిజపురంబునకుం జనుదెంచు
నవసరంబున ౧౪౩

చ అతుల మణి ప్రసూన కిరణౌఘసముజ్జ్వలిత ప్రసారసం
గత హరిదంతరాళముగ ధారుణికిం జనుదెంచు నా దివ
స్పతి యనుఁ బోలెనద్భుత విభాయుతుఁడై వెలుగొందు నమ్మహీ
పతిఁగని ద్వారకా నగరపాలురు సంభ్రమ బుద్ధినయ్యెడన్ ౧౪౪

వ సత్వరులై రాజమందిరంబున కరిగి

సీ॥ కమనీయ కురుటసంఘటితాబ్జరాగ ధ
గద్ధగల్ నిటలభాగమునఁదోలుక
తరళకుండలసముద్య ద్వజ్రదీధితుల్
గండస్థలంబునఁ దాండవింప
నెమ్మేని కనకాంబరమ్ము చెంగుహొరంగు
నింగికిబంగారు నీరువోయ
కరబద్ధశంఖచక్ర ద్యుతుల్నతకోటి
చంద్రసూర్యులజోక చౌకఁజేయ

గీ॥ నలుతె వనమాలికాంతు చయంబులోలసి
మేనిచాయల కొకవింత జానొనర్ప
ప్రాగ్ధరాగ్ర గతుండగు భానుఁడనఁగ
మిన్నగద్దియపై గొలువున్నవాని ౧౪౫

ఉ॥ వనజదళాయతాక్షు నభివర్ణితకౌస్తుభవక్షు సత్కృపా
భినుతకటాక్షు దాసజనబృంద నిరంతర రక్షణక్షమ
ప్రణుత విచక్షు గోకులతపఃఫలరూపకు లోకదీపకున్
వినుతసహిష్ణుఁ గీర్తిప్రభ విష్ణునిఁ గృష్ణునలంకరిష్ణునిన్ ౧౪౭

సీ॥ ఒకయోరఁ జేరి సనకసనందనముఖ్య
మునివరుల్ గుణగాన మును బొనర్ప
నొకఁ గ్రేవఁ దనరి నేత్రోత్సవంబుగ వసు
దేవాదిగురుజనుల్ ఠీవి దనర
నొకవంక నిల్చి సాత్యకికృతవర్మాదు
లసిశరాసనధారులై చరింప
నొకచాయ నెలకొని యుద్ధవాక్రూరాది
సచివపుంగవులు హెచ్చరిక దెలుప

గీ॥ సకలసామంతహితమంత్రిజనపురోహి
తార్య కవిగాయకాదిసప్తాంగజనులు
గడఁగి కొలువఁగఁ బేరోలగమున నున్న
జిష్ణుఁ గరుణాగుణాలంకరిష్ణుఁ గృష్ణు ౧౪౮

కం॥ కనివందన మొనరించి స
వినయానమితోత్తమాంగ విలసితులై యి
ట్లని విన్నవించి రామర
ధునీ ఘుమంఘుమిత పటు మధురరస ఫణితిన్ ౧౪౯

చ॥ సకలదిగీశమౌళిమణి సక్తపదాంబుజ చిత్తగింపు మే
మొక యరుదిప్డుఁ గంటి మజుఁడో హరుఁడో బలశాసనుండొ దా
నకలుషదీధితివ్రజసమావృత దిఙ్ముఖుఁడై యొకండు తా
వక సముఖంబుఁ జేర నిదె వచ్చెఁ గనుంగొను మంచుఁ జెప్పినన్ ౧౫౦

వ. సభాసదులు కృష్ణునిం దిలకించి యిట్లనిరి. ౧౫౧

శా॥ లీలామానుషవేషధారివయి హాళిన్ క్షీరవారాశి కే
ళీలోలత్వము డాచి యివ్వసుధనోలిన్ భవ్యశూరాన్వయా
యాలంకారుఁడవై జనించిన నినున్ సాంద్రమానాథు ది
క్పాలవ్రాతము గొల్వవచ్చుట రుదే బ్రహ్మాదులగ్గింపఁగన్ ౧౫౨

ఉ॥ అనిపల్కెన్ వసుదేవసూనుఁడు మదిన్ హర్షప్రకర్షమ్మెల
ర్పనన్ ప్రీతిని, ద్వారకఁగలుగు సత్రాజిత్తుదా సూర్యుఁ గూ
ర్చి నితాంతోగ్రమహాతపస్యను బొనర్చెన్ దానికిన్మెచ్చి య
వ్వనజాప్తుండొసఁగెన్ స్యమంతకమ్మణిన్ బ్రత్యక్షచింతామణిన్ ౧౫౩

వ॥ తన్మణిప్రభాశోభితుండై యాతం డరుదెంచుచుండెనని చెప్పినఁ దదను మతింజని పురపాలురు యదార్హకృత్యంబులం బ్రవర్తించి రనంతరంబున. ౧౫౪

మం॥ మురమథనుఁడొకనాఁడ
బ్బురమెదఁగదలుకొనఁగ దనదుపురవరమెల్లన్
బరికింపఁదలఁచి యుచితపుఁ
బరిచారకులోలసికొలువఁ బఱతెంచెనొగిన్ ౧౫౫

కం॥ భద్రగజస్కంధంబున
ముద్రితమణి రుచిరపీఠమునఁ బ్రమదరసో
న్నిద్రతనధిష్ఠితుండై
భద్రపదార్థములు పూని పడఁతులు గొలువన్ ౧౫౬

చ॥ ఇరుగడ రామసాత్యకుల భీప్సితభద్రగజాధిరూఢులై
సురుచిర మంజుభూషణ విశోభితులై చను దేరముండటన్
గరముల హేమనేత్రములు గైకొని యుద్ధవముఖ్యులున్ బరా
బరులొనరింపఁగాఁగెలనఁ బాయక యాదవులోలిఁ గొల్వఁగన్ ౧౫౭

చ॥ అభిమతదివ్యమంగళ పదార్థములూని వెలందుకల్ మహా
విభవముతోడఁ గొల్వఁ గడువేడుకఁ బణ్యసతీ వతంసముల్
శుభకరనాట్యవైఖరులు సూపమహోన్నతలీల యాదవ
ప్రభుతిలకాగ్రగణ్యుఁ డభిరాముఁడుగాఁ బురమేగ వెల్వడన్ ౧౫౮

మ॥ పురసౌధాంతరసీమలన్ మెలఁగుచున్ బూఁబోఁడులా దేవకీ
వరగర్భాబ్ధిసుధాకరున్ మహితలావణ్యాకరున్ శార్ఙ్గ శం
ఖరథాంగాసిగదాధరున్ వినతరక్షాచారు కారుణ్య బం
ధురుఁ బీతాంబరుఁ గాంచి రుల్లములఁ దోడ్తోఁ బ్రేమ సంధిల్లఁగన్ ౧౫౯

వ॥ అయ్యవసరంబున ౧౬౦

సీ॥ పురుటింటిలోనుండి పూతనప్రాణముల్
పుక్కిలించినమహా పురుషుఁడితఁడె
కొండకైవడిసము ద్దండమైతగుబండి
విఱుగఁదన్నినమహా వీరుఁడితఁడె
యైదేండ్లపాపఁడై యఱ్ఱబంపుమద్దులఁ
గూలఁద్రోచిన బలశాలియితఁడె
యేడేండ్లబాలుఁడై యెత్తెఁ గొనగోటఁ
గొండనిల్పిన మహాత్ముండితండె

గీ॥ చెలఁగిముట్టిన దావాగ్ని చిచ్చువెన్న
ముద్దచందానమ్రింగిన పెద్దయితఁడె
చేరికంసునిఁగడిమి భంజించిసాధు
జనులదయమీఱఁ బ్రోచినఘనుఁడితండె. ౧౬౧

మ॥ అకతంసోత్పలసౌరభగ్రసనలీలాలోలరోలంబమం
ద్రవిరావామృతసాహచర్య మురళీనాదంబు సూర్యాత్మజా
సవిధోల్లోల తరంగనిక్వణ లయస్ఫారంబుగాఁ గాళియా
హివరేణ్యోరుఫణాగ్రరంగముననర్తించెన్ నటుండీతఁడై ౧౬౨

ఉ॥ వెన్నలతోడ డెందములు వింతగనొక్కొఁట ముచ్చిలించి క్రే
క్రొన్ననబోండ్లగొబ్బచను గుబ్బలుపూవుల చెండ్లటంచులో
నెన్నికరాంబుజంబులధరించి విలాసమునూనెనారయా
కన్నెలనోముపంట మెయిఁగాంచియితండయి నిల్చెనోచెలీ ౧౬౩

మ॥ తనకైకోరని వాసవుండలిగి మాద్యత్పుష్కలావర్తకా
బ్దనికాయంబును గూర్చిగోగణముపైఁ బాషాణవర్షంబు నే
ర్పునవర్షింపఁగఁజూచి చెంగటి గిరిన్ బూబంతియున్ బోలెఁ దాఁ
గొనగోటన్ ధరియించి ప్రోవఁడె వెసన్ గోగోపకవ్రాతమున్ ౧౬౪

చ॥ అనుపమమోహలక్షణము నంచితవేణుని ప్రకాండహృ
ద్వనరుహవీథులందునిలువన్ గడలేనియఖండమౌ వెలుం
గనయము నంగసంగసుఖవాదృతి వ్రేతలతోడ క్రీడలన్
జనువొనరించెనా పొగడ శక్యమె వారలభాగ్యవైఖరుల్ ౧౬౫

ఉ॥ ఎంతతపంబుఁ జేసిజనియించెనొ కోయలవేణుఖండమున్
మంతుకు నెక్కె నానవతమాల కిసాలము కర్ణికారమున్
వింతలెసంగ నెమ్మి పురివీని మెయిన్ దులకించె వీనిలో
నింతిరొ యొక్కమైనతవణించుఁ గదే మనకట్టి భాగ్యమున్. ౧౬౬

వ॥ అనితలంచుచు. ౧౬౭

ఉ॥ జాలకవీథుల న్నిలిచి సారెకు చారుశుభాక్షతావళు
ల్లాలితకుందకుట్మలములన్ నవమౌక్తికపాళిఁ గూర్చి ప్రో
యాలుగుముల్ ముకుందు పయినర్యోడ సేసలు చల్లిరాత్మలన్
జాలఁగ సంతరించు తమసాత్విక భావములుల్లసిల్లఁగన్ ౧౬౮

మ॥ పురిసౌధాంతరసీమలన్నిలిచి యాపూఁబోఁడులొక్కమ్మడిన్
హరిపైఁ జల్లిన మౌక్తికాక్షతలు సంవ్యాప్తంబులౌటన్ నభం
బరుదై తోఁచె సమిద్ధకల్పిత వితానాకీర్ణమైనట్టులు
ర్వరయున్ మంజులరంగవల్లికలఁ జిత్రంబైన చందంబునన్ ౧౬౯

తే.గీ॥ ఇవ్విధంబునఁ బురజను లెల్లనారఫు
మించి నయనోత్సవంబుగఁ గాంచుచుండ
నభినుతానన్య సామాన్యవిభవ మెసఁగ
శౌరి పురవీథులందేగు సమయమునను ౧౭౦

ఉ॥ చేరికలంతులందు యదుశేఖరు లూడిగమాచరింపఁ గై
వారము సేయుచున్ గలన వందిజనంబు పరాకు దెల్పనీ
రేరుహపాణులొక్కయెడ నృత్యకలాకలనంబు చూపఁగాఁ
జారులు సంతసించిరల పత్తనవీథులఁ గృష్ణుఁ డేఁగఁగన్ ౧౭౧

తే.గీ॥ నర్మసఖుఁ డొక్కఁడల నందనందనునకు
జిత్తమిగురొత్తనొకవంకఁ జేరినిలచి
వలఁతిమాటలఁ దత్పురీ వరవిలాస
కలనఁ దెలుపఁగఁ దొడఁగె నింపలర నపుడు ౧౭౨

ఉ॥ నందతనూజ చూడుమదె నాగరవీథుల గారుడాశ్మసం
స్పందితతోరణావలులు భాసిలె నగ్రములందు ముత్తెముల్
పొందుగ నొప్పఁ గ్రొన్ననలఁ బొల్చిన చారుసుమాలపల్లవా
మంద విభా ప్రభావము సమస్తము నొక్కటఁ జూఱ వచ్చుచున్ ౧౭౩

చ॥ పురివిపణిప్రదేశములఁ బొల్పగు కాంచనరత్నరాసుల
త్యురుతరవైఖరిన్ దనరెనోలిఁ గనుంగొనుమింద్రముఖ్యని
ర్జరవరసేవనియగుణసంభృతునిన్ భజియింప మేరుభూ
ధరమును రోహిణాద్రియు శతప్రతిభన్ జనుదెంచెనో యనన్ ౧౭౪

చ॥ అగణితరత్నహర్మ్యశిఖరాగ్ర చరద్వనితాకరద్వయీ
విగళితమౌక్తికప్రజము వేమరుఁ జూడఁగ నొప్పెనీసుగాఁ
దగమణిసంతతుల్గురియు ధారుణిఁ గన్గొని దానిమించఁగా
గగనము మేలిముత్తెములు కానుక జేసెడునాఁగఁ గేశవా ౧౭౫

మ॥ అనియాతీరునఁ దెల్పు నర్మసచివ వ్యాపారముల్ శౌరిసు
న్ననాలించుచు మందమంద గతిసౌందర్యంబుసంబోవుచుం
గనెనత్యంతవిచిత్రరత్నమయరంగ త్సౌధహర్మ్యాంగణా
ప్రణుతం బైపటుసంపదాప్తిఁ దగు సత్రాజిత్తువేశ్మంబొగిన్ ౧౭౬

మ॥ కనితచ్చారుసువర్ణకల్పిత గవాక్షవ్రాతనిర్యత్సుగం
ధనితాంతాగురుధూపధూమకలికా నవ్యాంబుదభ్రాంతిసం
జనితానందనటన్మయూరవని తాసంతాననాట్యక్రియా
భినుతప్రాంగణవేదికావిభవముల్ విభ్రాంతివాటింపఁగన్ ౧౭౭

ఉ॥ దానవవైరిపల్కె వితతద్యుతి కాంచనరత్నచిత్రితం
బీనిలయంబదెవ్వరిది యిందువసించుమహానుభావుఁడై
య్యే నియమవ్రతాదులొనరించి జనించినవాఁడొ వైభవా
నూనతరాజరాజభవనోచితవిత్తనిధానమై తగన్ ౧౭౮

కం॥ కన్నులపండువు గానెల
కొన్నది యిమ్మేడయిందుఁ గోరి వెలయు నా
సన్నుతునిఁ దెలుపుఁడనవిని
క్రన్ననఁ గృతవర్మవలికెఁ గౌతుకమలరన్ ౧౭౯

శా॥ అత్రాసస్థితిలోకవర్ణిత తపస్యావైఖరిన్ బద్మినీ
మిత్రుఁ బ్రీతునిఁజేసి తత్కరుణపేర్మిన్ స్వర్ణప్రవర్షవై
చిత్రింగాంచు స్యమంతకాహ్వయమణిశ్రేష్ఠంబుఁ గైకొన్న యా
సత్రాజిత్తు నివాసమియ్యది విరాజద్వైభవంబై తగున్ ౧౮౦

కం॥ దినదినమిరువదిబారువు
లనుపమమగు శుద్ధహేమమమ్మణిగురియున్
ఘనమందుఁగలన విత్తే
శునికన్న మహాప్రభావశోభితుఁడయ్యెన్ ౧౮౧

వ॥ అదియునుం గాక ౧౮౨

శా॥ ఏరాజేలెడురాజ్యభాగమున దానీరత్నరాజంబు ని
త్యారూఢోజ్జ్వలపూజలందనియు నయ్యారాజ్యభాగంబులన్
క్రూరవ్యాధిమహోపమృత్యు వికృతక్షోభాద్యకష్టంబులున్
మారీకంటకదుఃఖముల్దొలఁగి సౌమ్యక్షేమముల్ వర్ధిలున్ ౧౮౩

కం॥ ఏరాజునొద్దనిమ్మణి
సారతరార్చనలఁగాంచు సంతత మాధా
త్రీరమణునిఁ బోరులలో
వైరులకుంగెలువరాదు వారిజనాభా ౧౮౪

చ॥ విదితమహాప్రభావమయిపెన్గెడు నిమ్మణిరాజమున్ భవ
త్సదృశులకబ్బెనేని సరసంబగుయోగ్యసమాశ్రయంబునం
దదియటుగాక నిష్ప్రభులకబ్బిన లోభులకబ్బినట్లు దా
వృథయగుఁగావెకన్గొనఁగ వృష్ణికులాంబుధిచంద్రనాథుడున్ ౧౮౫

మ॥ అగునమ్మాటనిజంబు మున్ను నగరద్వారస్థులేతెంచి పొం
దుగనాచెంగటఁ బల్కిరేమణియుతిన్ దోతెంచుసత్రాజితున్
సుగుణోదారుఁడతండు నిర్మలయశస్కుండంచు భాషించు న
స్నగరాద్ధారిని దానవారినట గానక్ వచ్చెనాతండొగిక్ ౧౮౬

కం॥ చనుదెంచివినయమెదఁ గ్ర
న్ననఁబొడసూపఁగను నందనందనుఁగని మ
న్ననమీఱఁగాన్కలిడు నా
తనిఁగృష్ణుండాదరించి తగనిటుపలుకక్ ౧౮౭

ఉ॥ చిత్తముసంతసించె నృపశేఖరనీకనవద్యసత్తపో
వృత్తినచంచలస్థితిని వేదమయుణ్ సవితణ్ బన్నితా
యత్తునిఁజేసి తత్కృతమహామణిఁదెచ్చితివెన్నగా భవ
ద్వృత్తము లోకసంస్తవనవిశ్రుతమై విలసిల్లకుండునే ౧౮౮

వ అనికృష్ణుండు నతనిబహూకరించి తదీయోప హారంబుఁ బ్రియంబుసంఁబరి గ్రహించి నిజ గృహగమనంబునకతని ననుమతిఁ జేసెనయ్యవసరంబున ౧౮౯

చ అవిగళరత్నదీప్తి నిచయుంబలు గ్రమ్ముపసిండి మేడపై తావల యనుంగుబాలక తోరఁపుఁ గ్రొంజవికెఁ వసించియా దవకులభూషణుంగనె ముదంబిగురొత్తఁగసత్యభామ క న్నవల మెఱుంగుఁలాలి విరికల్వల చెల్వము గొల్లలాడఁగఁ ౧౯౦

శా కాంతారత్నము కృష్ణుగన్గొనఁగ నుత్కంఠాను రాగోత్తమా సంతోషంబు మనంబునిండి వదనాబ్జం బుల్లసిల్లఁగ న త్యంతంబై పులకోద్గమంబొదవఁ గంపార్కఁదప్రాపాణిచే నంతస్సుద్ధి జనించనట్టి యపహిత్థాభ్యుద్గతిన్ దోఁయిమున్ ౧౯౧

వ అప్పుడు ౧౯౨

చ వలుద మెఱుంగులీను చెలువంబగు వేలుపు గాఁదరాలని చ్చలఁపుఁ బసిఁడి యుప్పరిగ చందురు సాలవసించినిద్దపున్ దొలుకరిగ్రొమ్మెయిల్లసుధఁ దోఁచురుటంపు మెఱుఁగుదీవె నా గలికి మనోహరాకృతితగన్ మురవైరికిఁదోఁచెనయ్యెడన్ ౧౯౩

ఉ॥ అన్నలినాయతాక్షిరుచిరాంగవిలాసము మీనునూను నా క్రొన్ననవింటిజోదు విరిగోలలెఱుంగున దోఁచిచిత్తమున్ గ్రన్ననఁజొక్కఁగావలపు గ్రమ్మఁగఁజేసినఁ గంసవైరియున్ గన్నులపండువైతనరఁగన్గొనె నబ్బురపాటుమించఁగన్ ౧౯౪

వ॥ ఇట్లు వసుదేవనందనుండు స్త్రాజితిం గనుంగొని తదీయసౌందర్య రేఖావి లాస సందర్శన లాలసంబులైన చూపుల నెట్టకేలకు మరల్చి ప్రకృత ప్రసంగ సంగతంబులం గావించి తదనంతరంబున ౧౯౫

కం॥ హరియును సాత్యకియును నిరు గెలఁకులఁబ్రియమలర నడువఁ గృతవర్మయు నుం గలనిలిచి జనులసందడిఁ దొలఁగఁజడియనరిగె నయ్యదుప్రభుఁడెలమిన్ ౧౯౬

వ॥ ఇట్లుచనిచని కనకమయ ఘనకవాట ఘటిత పటుతర హరిన్మణి నికరకరం బితాంశు కదం బాడంబర విడంబిత దూర్వాంకురాది మంగళపదార్థ సమహిత పార్శ్వవేదికాతలంబును, వేదికాతల విలిఖితమృగమద మృదిత పరిమళ మిళదళిరళగళదగురు ధూపధూమమాలికా విలసన ఫలిత పరిసరదాడిమీలతా వితానంబును, దాడిమీఫలగ్రసనరసిక శుకనికరసుకరాలాపలీలావిలసిత విలాసవతీ వదనేందుమండల సముదితదరస్మిత చంద్రికాకం దళద్రవమాణవిధుశిలాకలాపవిలులిత జలకణ ద్విగుణితజలయంత్రశీకరప్రసరణ విస్ఫురరంబును, విస్ఫురసితద్యుతివితాన వితానాయమాన మౌక్తికరంగవల్లికాసమంచితమణిభవనవిటంక ఖచిత శతమఖోపల కలికాప్రకాశ జలధర శంకానువర్ధిత ప్రమోద నృత్యన్మయూరవనితాభినుతకేకాసమాటీకాప్రేడిత షడ్జగ్రామముఖరవీణానువాదనప్రవీణ మానవతీసప్రణయకటాక్షవీక్షణ ద్విగుణితేందీవరతోరణవిశాల చంద్రశాలాంతరాళకీలితయంత్ర పాంచాలికాకరాకృష్యమాణమణిచామర జనితానిలకిశోరసంచార మనోరంబునునై యపూర్వవిలాసంబుగలిగి చిలుకులకొలుకులజిలిబిలిపలుకుల కులుకుఁదెలుపు చలువకప్పురపు పలుకులొలుకు నలతియనఁటి బోదుల పాఁదుల నూదుకొను విరవాదిబోదల మెదల కొదమతుమ్మెద కదుపుల గరుల సిరుల కుఁ గొసరులొసఁగెదునెరికురులుగల తలిరుబోండ్లు గుబ్బపాలిండ్లకు జోండ్లగు పసిఁడి గిండ్ల బొందుకొలిపిన, మగమానికఁపు తీరుకంబంబుల డంబుల నిలంబరు హజారంబులఁగ్రందుకొను మన్నెదొరల బొమిడికంబులఁ గొమరుమిగులు తమ్మిత్రా నిగనిగలఁ దెగడు పగడపు జగితులఁ బొగడొందు నగరు ప్రవేశించి యెడనెడముకురమణి కలాచికాది మంగళపదార్థములఁ బొడఁగనుచుఁ గొఱనెలల తెఱంగున మెఱయు నుదురులుగలమదవతులు బంగరు పళ్లెరంబుల నీరాజనంబులొసఁగ, నరిగికక్ష్యాంతరంబులు గడచి, కొలువుకూటంబున నెలకొని యదువృష్ణి భోజాంధకాది బలంబులు కొలువ నభిమత విలాసంబున హలధర సహితుండై ప్రొద్దులుపుచ్చుచుండె నంత ౧౫౭

క॥ వసుదేవ ముఖ్యగురుజన
విసరమునకు, నభిమతములు వెలయించుచుసం
తసమూన హృద్యవినోదా
వసరములంతనరె భక్తవత్సలుఁడంతన్ ౧౫౮

వ॥ అని చెప్పుటయును. ౧౯౯

మ॥ చరణాబ్జానమితామరేంద్ర మకుటాంచత్పద్మ రాగప్రభాం
కురనీరాజనరాజమానచరణా కుక్షిస్థితాజాండ బం
ధురసందర్భచరాచరావన బుధస్తోత్రైకపారీణ సా
దరకారుణ్యనిదాన వేంకటగుహీంధ్రస్థాన నారాయణా ౨౦౦

కం॥ నిరుపమకారుణ్యరస
స్ఫురణాపరిశోషితార్తపోషణనిపుణా
వరవేంకటాద్రిశిఖరాం
తరనిలయధురీణకీర్తి తస్ఫుటసుగుణా ౨౦౧

మాలినీ॥ పరమసుగుణశీలా భక్తలోకైకపాలా
స్ఫురితకనకచేలా భూషితాంభోజమాలా
నిరుపమసుఖలోలా నిర్జితారాతిజాలా
విరచితభవలీలా వేంకటాద్రీంద్రపాలా ౨౦౨

## గద్య

ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాప్రసాదితానవ
ద్యకవిత్వవిద్యాభినందనగిరిజామనోహరచ
రణారవింద సేవామరంగ బిందు బృందతుందిల
మానసేందిందిర సాంఖ్యాయనసగోత్రజలధి
చంద్రోదయాయ మానసుబ్బారాయపౌ
త్రపాపయామాత్య సంక్రందననంద
నసహజ పాండిత్య గేయకవితా
రమణీయ సకలసుకవివిధేయ
సాంబశివ నామధేయప్ర
ణీతంబగు సాత్రాజి
తీ పరిణయంబ
ను శృంగార
కావ్యంబు
నందుబ్రథమా
శ్వాస
ము.



# ద్వితీయాశ్వాసము

కం॥ శ్రీభూనీళాసంతత । శోభితనిజపార్శ్వభాగ శుభకౌస్తుభ ర
త్నాభివ్యక్తభుజాంతర । సాభికమలమధుకలిత వనజభవ దేవా! ౧

వ॥ అవధరింపుము శుకయోగిపరీక్షున్నరేంద్రునకిట్లని చెప్పె నిట్లు గోపాలదేవుం
డభిమత విహారంబులం బ్రవర్తించుచున్న యవసరంబున.

మ॥ మును సత్రాజితునింట మోహనకళా మూర్త్యంతరంబైన క్రొ
న్ననబోణిం దిలకించినంతఁ దదనూనప్రౌఢలావణ్య రే
ఖనితాంతోల్బణరాగసంజనకమై కంసారికశ్రాంతమున్
గనులంగట్టినచందమై మదితదేకచ్ఛందమైనిల్వఁగన్ ౩

ఉ॥ సారణుఁడన్ననర్మసఖు శౌరిముదంబునఁ జేరఁబిల్చి శృం
గారవనంబునందు శశికాంతమణీమయవేదినాత్మ కిం
పైరహియించుపూఁబొదల యందముచూచుచుఁదద్వినోద కే
ళీరసలాలనుండగుచు లీలవసించిముకుందుఁడిట్లనెన్ ౪

కం॥ వింటివె సారణమును నేఁ! గంటిన్ సత్రాజితుని నికాయమునను హా
ల్లంటినొక్కర్తుపూవుల । వింటిదొరద్రిలోకమోహ విద్యనుబోలెన్ ౫

చ॥ సురనరకిన్నరాంగనల సుందరరూపకలాపధన్యలన్
నిరతమునుంగనుంగొనమె నెయ్యుఁడ! పద్మభవుండుసృష్టి చా
తురిసకలంబు నేర్పడఁగఁ దూకొనినిత్యకృతావధానుఁడై
విరచనచేయఁబోలు నలివేణిని భారతితోడివాదునన్ ౬

సీ॥ కమలాక్షి వేనలి ఘనలక్ష్మినిరవొందె
వదనంబు రాజవైభవముఁ గాంచెఁ
గలికిచొక్కపుఁగనుల్ కమలాధికములయ్యె
నతివపీనులు శ్రీమ యత్వమొందెఁ

గామినీమణినాస కాంచనోజ్జ్వలమయ్యెఁ
బలుమొనల్కుందవిభ్రమము మించె.
వలుదగుబ్బలుచక్ర వర్తులశ్రీనొందె
నా రహీనరమా విహారమయ్యె

గీ॥ కానవంతవిభూతిసం కలనఁజెందెఁ
బడఁతికంధరశంఖసౌ భాగ్యమెనసె
బలుపిఱుందులు ధరణిమం డలమునేలె
భాగ్యలక్ష్మీస్వరూపమా వనితసఖుఁడ 8

కం॥ విడువకశృంగారరసము । గడకొని నల్లడలగురిసి కార్కొనితగునీ
పడఁతి కచఘనమునకురస । మెడలినవెల్లనగుజలద మెనయేతలఁపన్ 9

చ॥ కలికిచొకారపున్నగు మొగంబునకున్ దులగాకనిండుజా
బిలిపదియాఱుప్రయ్యలుగ బీతిలి లోనఁగళంకమూని కొం
గలమునవేల్పుపేటియటుత న్దపమూనియు నీఁగలేకఁద
త్తులితములంచునో కనరు నోఁపఁగఁదమ్ములనేచఁబూనెడిన్

మ॥ వనితాచారుతరాస్యసంకలిత లావణ్యామృతోర్మిప్రభూ
త నవాంభోరుహయుగ్మమోయనఁగనే త్రద్వంద్వమింపారుఁ ద
జ్జనితామోదవిలగ్నమత్తమధుప శ్యామావిలాసంబు పెం
పొనరన్ జూపులుసొంపుగుల్కుఁగమసీయోన్మేషభావంబునన్ ౧౦

ఉ॥ ఆమృగశాబలోచన యొయారపుభ్రూలతి కాప్రకాండము
ల్కోమలదృక్శిలీముఖ నికుంభనచాతురి మించిలోకముల్
దీమసమొప్పఁగాగెలువ డీకొనుపూన్కిఁ గృతార్థుడైన య
క్కాముని వింటిమోసులనఁగాఁ దనరారెడుఁజూపెమిత్రమా ౧౧

తే॥గీ తేనియలబావి వలపులఁ బూనుదీవి
సోయఁగపుఁగ్రోవి పగడపుఁ జాయఠావి
చివురుటాకులనీవి రా జిల్లుకేవి
క్రముల తావియువిదచెంగావిమోవి ౧౨

చ॥ ఉవిదరదచ్ఛదద్యుతుల కోడిపరాభవమీఁగఁబూనితీఁ
జివురు నిజోపచారముల చేతవనక్రియ సేవఁజేసియున్

దవిలినకోర్కి చేకుఱమిఁదాఁ గనెమాధవుఁగొల్చితత్సపర్యా
వవిహితమౌహారిన్మణిస వర్ణనిరంతరకాంతిపుంజముల్ ౧౩

మ॥ చెలువొప్పాఁదిలోత్తమాఖ్యలలనా శృంగారరేఖాద్యుతిన్
దలవం పైనమఱుంగుగావలచి యద్ధాత్రిన్ ప్రసూనస్థితిన్
దలసూపంగఁదిలోత్తమాఖ్య యిడిరంతన్ గామినీనాసికా
కలనన్ నిర్జితయై యధోముఖముగాఁగన్ నేఁడుఁజింతిల్లెడున్ ౧౪

తే॥గీ॥ సలలితసువర్ణకలన రంజిలిసమస్త
శబ్దసారస్యసంగ్రహ చతురలీల
వెలయుఁగావునయుగ్మలి వీనులకును
దనరుశ్రీకారభావంబు తథ్యముగను ౧౫

చ॥ కరముఁబ్రియంబుతో రుచిర గానపరిశ్రమమూనఁగోరి యా
దరము మెయిన్ దరంబువని తాగళవైఖరిఁగాంచికాకలీ
నిరుపమగానవైభవము నేరువఁబోలును గాకయున్న నుం
వరతరమౌక్తికప్రతతిఁ దాల్చిత్రిరేఖలఁబూననేటికిన్ ౧౬

ఉ॥ ఆదలితాబ్జమంజుల దళాయతలోచనగబ్బిగుబ్బలున్
వాదువాగెల్వఁబూని గరువంబుననున్నతకుంభపూర్ణతా
పాదనఁజాలలేక నిజపాలకృతాంకుశఘట్టనంబులన్
మేదినిక్రిందదూఱె వెఱమించినదిఙ్మదనాగపూగముల్ ౧౭

చ॥ అరయఁగనాభికాబిల ముఖాంతరసంస్థితినుండియుండి బి
త్తరిపృథులస్తనద్వయ సుధారసపూరితకుంభమాధురిన్
దిరముగనాననెంచి యరుదెంచెడుచీమలబారు నాఁగనుం
దరమగునారు చారు దళితస్వరధీశశిల విలాసియై ౧౮

తే॥గీ॥ గురుకుచద్వయపంకజ కోశరోచి
రాజిశైవాలనాభికా భ్రమణకలిత
సరసలావణ్యరససుధా ఝురమునందుఁ
దనరుతరఁగలునాఁగ ముత్తులువళులు ౧౯

కం॥ అతనువిభూతివహించిన । సతినునుజవ్వనమువలనఁ జనుఁగవయునుఁదా
నతనువిభూతివహించఁగ ! నతనువిభూతినలరారె నంగనకానన్ ౨౦

క॥ పున్నాగంబచ్చెలిజడ । పున్నాగములలనఁగాంచుఁబోలఁతిగమనముక్
బున్నాగము పొక్కిలియౌను । బున్నాగములనుజయించు పూనికకరుదే ౨౧

చ॥ అతులితమేఖలాహ్వయ మహామణికాంచనపట్టబంధ నం
గతినిరవొందియుజ్జ్వలవికాసమునన్నవఖండమండలా
యతసకలాంతరీపనిచయాత్తధరాపరిపాలనోర్జితో
న్నతిఁదగుఁజక్రవర్తుల ఘనత్వముఁగాంచుఁబిఱుందులింతికిన్ ౨౨

చ॥ సమమృదుపీనవర్తుల లసత్కమనీయవిలాసకాంతులన్
గొమరుదనర్చుచుండునల కోమలిపెందొడలందమొంద ని
కకముగఁదలంచునాయనఁటి కంబమగాన్ని పొరల్విదిర్చినన్
తనుమగుననితాంతపరి సర్పితచంద్రకమయ్యెనియ్యెలన్ ౨౩

తే॥గీ॥ ప్రచురదీధితిజంబాల ప్రపదమధ్య
భవ్యకేదారమునను లావణ్యరసని
షేకపరిపోషణముఁగాంచి చెలువునూపు
కలమగర్భంబులనఁగ జంఘలుదనర్చు ౨౪

క॥ చివురులసవురునునిద్దపుఁ । బవడంబులడంబు నరుణ పంకజములలోఁ
దవిలినసోయఁగమును వెసఁ । దవులుఁజౌనవలాపదాబ్జ తరుణారుణిమల్ ౨౫

ఉ॥ తమ్ముల తమ్ములై రుచికదంబరసాల లసత్కసాల జా
తమ్ముల సొమ్ములైనుమహి తన్ఘటితారుణసత్ప్రవాళజా
తమ్ముల కిమ్ములై మణికదంబితనూపురయుక్తినింతి పా
దమ్ములు నెమ్మినొప్పులలితద్యుతలక్షణలక్షితమ్ములై ౨౬

వ॥ మనమ్మున నగ్గలమ్మగు మోహావేశమ్మున మున్నఁదాఁగన్న యన్నులమిన్న వదనాద్యుత్తమాంగానన్యలావణ్య సౌకుమార్యాదులవలన తత్సర్వాంగ సౌందర్యంబు నూహించి విధాతృసృష్టి నుత్తమోత్తమంబులగువస్తునిచయమ్ములఁ గించిత్ప్రదృశంబులగు వానిలోనం దలపోసి తనభాషా పాండిత్యంబొప్పినంత వట్టు తద్రుచిరాంగకరామణీయకంబుఁ బ్రశంసించి యమ్మగువ యాభిజాత్య నామధేయాగు లెఱుంగ చిత్తం బుత్తలంబంద నర్మసఖునకిగిననతం డిట్లనియె. ౨౭

సీ॥ అతిలోకసౌందర్య యగునవ్వధూమణి
సత్రాజితునిపుత్రి సత్యభామ
యను పేరఁ జెలువొందు నాభిజాత్యవిశిష్ట
యమరకాంతలమించు నట్టిరూప
గుణసమృద్ధులతోడ గణుతింపఁగాఁజెల్లు
కన్నె సద్వరుఁగోరి యున్నదిప్పుడు
కుసుమకోమలి కట్టి రసికాగ్రణికిఁగూర్పఁ
దలచెనో విధికీలు తెలియరాదు

గీ రమణినీయందు బద్ధాను రాగయయిన
యట్టులెదోఁచెడి మొన్న నిన్ గన్న నాఁటి
హావభావ విలాసాదు లరసిచూడ
రసికశేఖర నీకె యా రామతగును ౨౮

చ కనుగొన వేయునేత్రములు గావలెఁబో నిజమున్నయట్లుగా
వినుతియొనర్పఁ బూననిరు వేలరసజ్ఞలునైనఁ జాలవో
వనరుహనాభ యల్ల వరవర్ణినిచక్కఁదనంబు లోన నిం
పొందఁ శతాంశమైనవిను మోపుదుమేలి వరింప నావుడున్ ౨౯

కం సత్యానిహితాశయుడై । దైత్యారి నిరంతరమునుదన్మయుఁడగుచున్
గృత్యములు మఱచితత్సాం । గత్యముగలుగుటయొకో రెక్కఁ గానుండెఁగడున్

ఉ అక్కడ సత్యభామయును నిజాళుల చేననిశంబుఁ బలుకఁ లన్
జెక్క తెరంగులన్ మురవిభేదిజగన్నుతరూపసంపదల్
మక్కువనాలకించుచు నమందముదై యనురాగకందళుల్
మిక్కిలిగాఁగొనల్ నిగుడి మించగనుండెను కోర్కెలూఱఁగన్ ౩౦

వ ఇవ్విధంబున ౩౨

కం అంకురితభావులై హరి । శంకముఖియు ధూర్తవిభుఁడు నన్యోన్యమన
స్సంకల్పము లీడేఱఁగ । నంకిలిదీఱఁ దగుసమయ మఱయుచునుండన్ ౩౩

వ తత్సమయంబున ౩౪

కం॥ అనసత్రాజితునను జుఁడు । భాసురుఁడు ప్రసేనుఁడనఁగఁ బరగెడు వీరా
గ్రేసరుఁ డొకనాఁ డుదితా । త్యాసక్తిన్ వేఁటకరుగ నాత్మఁదలంచెన్ 3౫

కం॥ వలలురులుజిగురుఁగండెలు । నలుగులుసింగిణులుగొనుచు ననుగుంబోయల్
కెలఁకులనడువఁగఁబరికర । ములుగైకొనితగు పరిజనములుసేవింపన్ 3౬

కం॥ అవిరళదీప్తులుదిక్కుల । రవులుకొనంగాస్యమంత రత్నమునఱుతన్
దీరి ధరియించిభూషణ । నివహంబులు మెఱయఁ గుతుకనిహితాశయుఁడై

తే॥గీ॥ ఘనతరజవాతిధిక్కృత గంధవాహ
మగుచుఁదగునొక్కసైంధవ మగుహయంబుఁ
గూర్మితోనెక్కి యనుచరకోటిగొలువ
వేఁటకతఁడేగె నొకమహావిపినమునకు 3౭

వ॥ మఱియదియొక్కకాననంబు నిరంతరవసంత దంతురకిసలయ ప్రసవవిసరవిస్ఫుమర పరాగసౌరభ నీరంధ్రదిగంతరంబును, తరుణప్రవాళ ఫలసుమనఃపరాయణపరభృతశుకచంచరీకసమంచితకలకలకోలాహల బధిరీకృతరోదోంతరంబును, సింహశరభశార్దూలాద్యఖిల వన్యసత్వసంకులంబును, సాలతాలతమాలప్రముఖనిఖిలవిధవిటపిపటలఘటితంబును, జలజోత్ఫుల్ల కల్హారహల్లకసముత్ఫుల్ల మరందబిందుబృంద చంద్రికిత పయస్తరంగరంగన్మరాళచక్రబకసారకోయష్టికప్రముఖ వారివిహంగ గరుదనిల దరస్మేరవనీరుహసౌరభలుబ్ధభ్రమరఝుంకారముఖర కాసారభాసురంబునై శక్రవహ్నివరుణకుబేరనారదవాక్సమహితంబై సురలోకంబుపోలిక, శాండిల్యగాలవ బ్రహ్మణ్యజటిపటలసలలితంబై బ్రహ్మసభ తెఱంగున, బాలకృష్ణాహ్వయలాంగలీ విలాసకలితంబైనందునిమందచందంబున, కృష్ణార్జునద్రోణశల్యసహదేవసమువగతంబై భారతరణంబు విన్నాణంబున, సున్మత్తరాక్షసజంభనికుంభ నలనీలపనససుషేణ ప్రముఖవిలసితంబై రామరావణ సంగరంబు తెఱంగున, చంద్రరోహిణీయుతంబై నిశాకాలనభోంగణంబుపోలిక, సముదితార్క విజృంభణంబై దివాభాగంబునుంబోలి, శారదానివసనంబై చతురానను మందిరంబుకైవడిమాధవీమన్మథ కలితంబై వైకుంఠ నగరంబు డంబున, సుమాకుమారసముచితంబై కైలాసశిఖరంబుకరణి, చలజ్జీమూతలలితంబై గగనంబు సరణి వెలయుచుండునందు.

కం॥ పటుతర మృగయారసనం । ఘటితాశయుఁ డగుచు మృగయుగణములు వివిధో
ద్భటయంత్రి దక్షులైరా । యటవీస్థలి వడఁకఁ దిరిగె నాతఁడు కడిమిన్

వ॥ అయ్యవసరంబున

కం॥ సాహసము మీఱ బహుళో । త్సాహంబు నిగిడి సునిశితంబగు నీటెన్
బాహులఁ బట్టి యెదిర్చిన । రాహంబును బొడిచె నొకకిరాతుఁడు కడిమిన్

చ॥ చరణ చతుష్కముం బొదివి చక్కఁగ నొక్కపదంబు లీల
నబ్బురము సెలంగ నొక్కబలముం గలఁడేఁ గయుఁ బోలె మింటి
కై హరిణ మొకండు పర్వ వెస నడ్డము దాటి పదద్వయ యుగ్మముల్
శరమునఁ ద్రెవ్వ నేసె నరుసంబున బోయ యొకండు నేర్పునన్

ఉ॥ చూపుల నింగలంబులు వసుంధరఁ గుప్పలు గూఱఁ గుంజమం
దేపున బొబ్బరించుచు నహీన భయానకమూర్తితో మహా
టోపత బీట పెట్టుకొని డొంగి మెఱుంగులు గ్రిక్కునద్భుత
ద్వీపి నెదిర్చి కుంతమునఁ దేకువఁ గ్రిమ్మె నొకండు వీకునన్॥

ఉ॥ ఏచి వరాహ మొక్కఁడు మహీస్థలి గ్రిక్కఁదలంగ నిష్ఠుర
ప్రోచిత ఘుర్ఘురధ్వనుల నొక్కట నింగలముల్గదుల్కఁగన్
చూచుచు నేగుదేర వెసనూల్కొని కార్ముక ముక్త భూరినా
రాచము పాలు సేసె భిదురంబున శైలముఁ గూల్చుపోలికన్॥

మ॥ గవిలోనుండి వెడందగుబ్బిల్లు మెఱయంగాఁ బెబ్బులిం జూచి తా
నవలీలన్నిశితాంకుశంబొకటిగా ధాకర్షముం జేసి రే
గా వడిన్ మార్గణ పాతరోషమున నాయ్యన్ బైకి లంఘించ రం
డవ బాణంబునఁ గూల్చె బోయ యొకఁడు ద్యద్వేగసంపాదియై॥

కం॥ కరికిరి హరిహరిణ చమర । తరతక్షు సరభశాద దర్వీకరభీ
కరఖడ్గ గవయ శరభా । ద్యరణ్యసత్త్వముల వేఁటలాడిరి కడఁకన్ ౪౮

వ॥ ఇట్లు బోయలా ఖేటకౌతుకంబునం బ్రవర్తించు నెడఁ బ్రసేనుఁడు.

కం॥ ఆ వేటలఁ దమకంబునఁ । దా వేఱుగ నడచి బోయ తండముతోడన్
బోవక యొక్కరుఁడయ్యతఁడు । దైవము ప్రేరేప నరిగె దర్పితుఁడగుచున్

వ॥ అయ్యవసరంబున ౫౦

మ॥ హరిణంబొండు నిజాశుగప్రహతమై యత్యంతవేగంబుతో
నరుదై పోవఁగ దానివెంటబడ తానాసాసవల్గత్తు రం
గరయోద్విగ్నఘనస్కుఁడై యరిగె నకాండన్ విధిప్రేరణ
త్వరమాణుండగుచున్ ప్రసేనుఁడగునే దైవంబుఁ దప్పింపఁగన్ ౫౧

మ॥ జననాశోర్వపరిసంస్థితుండగుచు నిచ్చన్ బోవు నాభూమిపున్
భువికిన్ డిగ్గిన సూర్యబింబమనఁగాఁ బొల్పొందుమాణిక్యమున్
గవిలోనుండి బిరానఁ గన్గొని సముగ్రక్రోధ దుర్వారమై
యపలీలన్ వెసదాటి బిట్టు చఱచెన్ హర్యక్షమొండుద్ధతిన్ ౫౨

మ॥ మదవేదండకఠోరకుంభదళనోన్మాదస్యదాహంక్రియా
స్పదహర్యక్షునిశాతఘోర నఖచంచత్కుంతసంఘట్టనన్
వదనోద్వాంత నితాంతశోణితకణ వ్యాప్తాంగుఁడై సంపత
ద్భిదురచ్ఛిన్నమహాద్రివోలె నతఁడుర్వింగూలె వీతాసువై ౫౩

చ॥ బధిరతదిఙ్ముఖంబగు నభంగురఘోరమృగేంద్ర గర్జిత
వ్యధితమనస్కమై చలనమందితదీయ నఖాశుగాహతిన్
బ్రధనవిభిన్నుఁడైన నిజపాలునిఁ బాయఁగలేని మాడ్కి న
య్యధిపతిపజ్జఁ గూలె వినుతాశ్వమసువ్యయ దుర్వ్యథాకృతిన్ ౫౪

కం॥ చటులనఖకులిశనిహతుల । నిటులఁ బ్రసేనుని వధించి హితరుచిపటలీ
జటిలంబగు మాణిక్యము । దిటముగఁ గైకొని మృగపతి మహోద్ధతితోన్ ౫౫

ఉ॥ అలఘుపరాక్రమక్రమస, మంచితమై మృగరాజ మిట్లుదా
బలిమిఁ గ్రహించి యమ్మణిన భంగురలీలఁ ధరించి కాంతిను
జ్జ్వలమయి పోవుచో నికట సంచరణుండగు జాంబవంతుఁడన్
బలితపు టెల్గుఱేఁ డొకఁడు పాయక కన్గొని విక్రమోగ్రతన్ ౫౬

మ॥ చలదుర్వీధరసానుభాగనిపతచ్చక్రాయుధప్రోథిను
జ్జ్వలముష్టిప్రహతిన్ మృగాధిప శిరస్సంభేదముం జేసి య
త్యలఘుస్వైరపరాక్రమస్ఫురణరమ్యంబౌ మణిం గైకొనెన్
బలవంతుండగువానికిష్టఫలముల్ ప్రాపించుటల్ కష్టమే ౫౭

కం॥ మానుగ దిర్యగ్జాతుల । కైనను న వాంఛనీయమగుమణి కతన
హానింగాంచెం బ్రసేనుడ । హా! నిజమర్థమున బ్రాణ హానియ కాదే ౫౮

వ॥ ఇదియునుంగాక. ౫౯

కం॥ సకలజగత్పూజ్యంబగు । నకలంక చరిత్రమమ్మ హామణిమహిమా
ధికమగుటం జేసి యళుచు । లకుం దాల్పంగరాదు నియతు లకుదక్కంగన్ ౬౦

కం॥ దానినెఱుంగక తాత్పర్యవ । నేనుండఱు చియగుకతనం జేటొందె ఘనం
బైన నగ్నీం దాల్పనళుచుల। కౌనె? నియతచిత్తులగు మహాత్ములదక్కన్ ౬౧

వ॥ అనిచెప్పిమరలనిట్లనియె నట్లుజాంబవంతుం డనన్యసామాన్యంబగు నమ్మణిం గ్రహించికొనిపోయి యనతిదూరంబగు వింధ్యగహ్వరంబు నున్న తననివాసంబునకరిగి యందుం దనకూతురు జాంబవతి యనుకన్నియ యొద్ద, సుకుమారుండను తనచిన్నకుమారునకును గందుకంబుగాం బొందుపఱచె. పదంపడి యిచ్చట ద్వారకానగరంబున. ౬౨

కం॥ కతిపయకాలంబరిగిన । సుతచరితుండైనయతం డనుజుపోబడి యే
వితమును దెలియక సత్రా । జితుండతిశోకపరిపీత చిత్తుండగుచున్ ౬౩

కం॥ అమ్మణింగనిమును స్త్రో । త్రమ్మొనరించుటలుగని తం డేపెనులో
భమ్ము నందమ్మణంచి ర । త్నమ్మును హరియింపబోలు ననితలంచె మదిన్

వ॥ అట్లు కొంత కాలంబుండి ౬౫

చ॥ అతులతపంబు పేర్మిన హిమాంశుని మెచ్చంగం జేసి లోకవం
దితమగునమ్మహామణిని దెచ్చికృతార్థతనమ్మియుంటి వ
చ్యుతునకుం బాటిలేదకట సోదరునిన్ వధియించి దాని న
ప్రతిహతలీలం గైకొనియె బల్మియుం గల్మియుం గల్గియుండుటన్ ౬౬

ఉ॥ ధర్మవిలుప్తమైనవసు ధాస్థలినొక్కటనుద్ధరింపంగాం
జేర్మిజనించెనిల్లుం బ్రభ విష్ణుండు విష్ణుండటందురిట్టి దు
ష్కర్మము సేతకేవగము గాంచండు కృష్ణునకేడ ధర్మమా
ధర్మవిదుండు సేయు చెయిదంబులు ధర్మములందు రోజనుల్ ౬౭

కం॥ అనిమిథ్యాశంసనములు । పనివడి పచరించుచును శుభప్రదుండగు కృ
ష్ణుని నిందం జేసె నాతండు । జనసమ్మతులైన వృద్ధ జనములయొద్దన్ ౬౮

వ॥ అట్టిసమయంబున ౬౯

మ॥ ఒకనాఁడావసుదేవసూనుఁడు సముద్గోల్లాసియై బాంధవ
ప్రకరంబాశ్రితులున్ బురోహితహితవ్రాతంబులున్ దండనా
యకులార్యుల్ సచివుల్ భటుల్ బుధులు నెయ్యంబొప్ప సేవింప మ
చ్చికతో నోలగముండి యిష్టమగు గోష్ఠిన్ బ్రీతితో నుండఁగన్ ౭౦

ఉ॥ శాసనధాతులై నిఖిల సాగరవేష్టిత మేదినీశులు
ల్లాసముతోడఁ గొల్వ నిజలక్ష్యములందగు వెల్గుగాత్ర వి
న్యాసమునొంకెనంచుఁ బ్రియమాఱఁగ యోగిజనుల్ భజింపఁగా
వాసప్రమించు దివ్యవిభవంబుననుండె జగంబులెన్నఁగన్ ౭౧

చ॥ సనకసనందనాది మునిజాలహృదంబుజ వీథినైనఁజ
క్కనియవిచింత్యమాద్యము వికారమవాఙ్మన సైకవేద్యమం
జనరహితంబు విశ్వగమచంచలమైన వెలుంగు యాదవుల్
చనవునఁ గొల్వఁ బాల్పడియె శక్యమె వారల సన్నుతింపఁగన్ ౭౨

శా॥ ఏలా బ్రహ్మపదంబు నింద్రవిభవం బేలా తపస్సిద్ధు లిం
కేలా నిత్యము నద్వితీయమజమున్ హృద్యంబ నాద్యంబ ని
ర్వేలంబై తనరారు బ్రహ్మము నిజశ్రీఁ దోఁప సేవించు నీ
ద్రేలం దొక్కని యంఘ్రిరేణువులు పేర్మిన్ రాల్చినం జాలదే ౭౩

వ॥ అని చెప్పి మఱియు నిట్లనియె ౭౪

మ॥ అనవద్యాభిమతేష్టవైభవము లన్యాంతంబు శోభిల్లఁగా
సనకాదిస్తవనీయుఁడాఘన యశస్సాంద్రుండు వందారు స
జ్జనతాధారుఁడు కృష్ణుఁడార్యహిత చంచద్గోష్ఠి దత్తాత్మవ
ర్తనుఁడై యుండి పురంబులో జనులవార్తల్ వేడ్కనాలించఁగన్ ౭౫

వ॥ తనచారులం బిలిచి యిట్లనియె ౭౬

కం॥ భూరమణుల లోచనములు। చారులె వారలె కదాయ జగముజనతా
ప్రారంభహితాహితములు। వారక యెఱిఁగింతురవని వల్లభులకొగిన్ ౭౭

వ॥ అని నిజచారులం గనిన యాప్తనవోవిధ వానుమోదనం
జనితప్రమోదమానసులనల్పుచు నిట్లనెని ల్లువిగామమ

త్సునిశితశాసనంబున వసుంధర గ్రుమ్మరువేళ నెద్దిమా
విని నతెఱుంగు దాఁచక దివేగమ మాకెఱిఁగించుఁ డేర్పడన్ ౭౮

ఉ॥ నావుడు గోపికాజన మనస్సరసీరుహచంచరీకు న
ద్దేవునిఁ గాంచి యాదరవిధేయవచోగతి నిట్లు వల్కిరో
దేవ! జగజ్జనంబులు మదీయ ధరం బ్రోవగ జన్మమొందె నా
శ్రీవిభుఁ డంచు నిన్నుఁ దమ చిత్తములందుఁ దలంతు రెప్పుడున్ ౭౯

మ॥ వ్రతదానాధ్యయనోపచారజపతీర్థస్నానహోమాదులన్
గతజన్మంబుల నేమి చేసితిమొ సాక్షాద్విష్ణుఁడౌ దేవకీ
సుతు సేవింపఁగఁ గల్గె నాదిమునిరాజుల్గాంచఁగాలేని య
ద్భుతము న్గంటిమి మంటిమందురు జనుల్పుంఖానుపుంఖంబుగన్ ౮౦

కం॥ జనకులము ముఱపించి జగ । జ్జనకుఁడవగు నీవు ప్రోవ సకలజనులక
త్యనుపమ సౌభాగ్యస్థితు । లౌన రెను నిక్కముగ సర్వయోగిశరణ్యా ౮౧

కం॥ జననభయవిదూరంబగు । ననవద్యబ్రహ్మమిట్టులవనీజనతా
వనముం గోరి మహీస్థలి । జనియించె నటం చు జనులు సంతోషితులై ౮౨

వ॥ మఱియును నిజమాయాబలైశ్వర్యశక్త్యుపబృంహిత పంచమహాభూతవికార
సమష్టిరూప బ్రహ్మాండవ్యాప్య వ్యాపకసమధిక స్వరూపుండును, శుద్ధసత్త్వ
చైతన్యమాత్రుండును, దేశకాలవస్తుత్రివిధపరిచ్ఛేద శూన్యుండును, సత్యజ్ఞాన
స్వరూపుండును, శరీరత్రయవిలక్షణపంచకోశవ్యతిరిక్తావస్థాత్రయసాక్షిస్వా
ధిష్ఠానావిద్యా ప్రతిబింబితప్రత్యగభిన్నసాక్షి మాత్రావస్థానసచ్చిదానందల
క్షణపరమాత్మ స్వరూపుండును, నిత్యనిర్మలనిరంజననిర్గుణనిర్లేపత్వాదిలక్ష
ణుండును నగు నాద్యంతశూన్యపరబ్రహ్మంబు మాకీమాంసచక్షుస్సులకు గోచ
రుండై లీలామాత్రగృహీతగోపవేషుండై సనకాదియోగిజనుల యోగసమాధిల
క్ష్యంబులకైన నందరానితన దివ్యరూపంబుఁ జూపి మమ్ము లం గృతార్థులం జేయు
చున్నవాఁడని యెల్లజనంబులు నుల్లంబుల నపరిమితానందమగ్నులై భవదీయది
వ్యలీలావిశేషంబు లుగ్గడించుచుండుదు రివ్విశేషంబు దేవరదివ్యచిత్తంబునకు
గోచరంబుగా నిడియుండగలదే యివ్విధంబుగాక ౮౩

కం॥ వనజోదరు సత్రాజి । త్తను నాఁడొకఁడు మాత్ర మతిమిథ్యాశం
సనరతుఁడై దేవర యెడ । లను గలుగఁగఁ జేసె నొకకళంకము మిగులన్ ౮౪

చ॥ ప్రకటితమైనదుష్కరతపంబున భాస్కరుఁగొల్చితా స్యమం
తకమనురత్నముం బడయ దానిని దేవరకిమ్మటన్న నీ
యకునికి నమ్మహామణి నిజానుజుఁడొక్కఁడుఁదాల్చియొంటివేఁ
టకరుగ వానిఁద్రుంచి కపటంబున మీరుహరించినారనన్ ౮౫

వ॥ ఇదియొకటిమాత్రమతండు దేవరయెడన కీర్తికళంకంబుగల్పించి దూఱుచున్న
వాఁడని విన్నవించినఁ గంసారి వారలంగాంచియిట్లనియె. ౮౬

క॥ మీవిన్నతెఱఁగుఁదెలియం । గా వచియించితిరి లెస్సకడువడిఁబురర
క్షావిధికి నరుగుఁడియ్యెడ । నావుడుబనివినిరి నందనందనునాజ్ఞన్ ౮౭

ఉ॥ అప్పుడుశౌరిసభ్యులను నందఱఁగన్గొనిపల్కెవింటిరే
యిప్పుడుచారులాడుతెఱఁగెల్లను చోద్యముదీననేమియుం
దప్పకయేనెఱుంగమి వృథాయపవాదముగల్గెదీనినే
చొప్పునఁదీర్చ్చగావలెనొ చూచివచించుఁడు ధీరమానసుల్ ౮౮

క॥ నేమములేకయు నూరక । వారడినిందలఁ బడంగ నగు నేయదిబల్
నారసము బోలెహృదయాం। భోరుహమునలంచు ననిశముసుదుస్త్యజమై ౮౯

వ॥ అదియునుంగాక యనేకపురాతన కథవిని యుండుదు నత్తెఱంగెఱింగింతు
వినుండనియిట్లనియె ౯౦

## గజాసురవధ కథాప్రారంభము

మ॥ కలఁడుల్లోకబలప్రతాపనిధి సాహసౌర్యరేఖాకృతిన్
ఖలుఁడొసామజదైత్యుఁ డుద్ధతమహా గర్వాంధుఁడైలోకముల్
బలిమిన్గాసిమొనర్చిధర్మపథ విభ్రష్టంబుగావించి వే
ల్పులనుం బోరనజేయుఁడై మెలఁగు నేపున్ జేవయుం మీఱఁగన్ ౯౧

క॥ కలశాంబునిధిసముద్గత ॥ హాలహాలసంవ్యాప్తినొంది యుడాన మహోగ్ర
బలి గుండడరనిప్రతాపా । ర్చులచేఁద్రిభువనములతి నిరుద్ధములయ్యెన్ ౯౨

వ॥ ఒకనాఁడాదనుజాధిపుండు కులిశాత్యుగ్రాయుధార్చిచ్ఛటా
వికలార్కప్రభుఁడై నభంబగల నుద్వృత్తిన్ మహాసంగరా
నకభాంకారములావరింప నిజసేనాధూళి జీమూత బో
ధకమైదిక్కులఁగాఱ్కొనంగ పమనోద్దానీజి గిషాకతిన్ ౯౩

వ॥ చనుదెంచినఁ దద్ద్విజయోపాయంబుఁ గానక పాకశాసనుండు బృందారకముని పురస్సరుండై సత్వరంబుగ నరిగి ౯౪

చ॥ రవికిరణావధూత హిమరశ్మిసుదీర్ఘరుచి ప్రకాండముల్
భువినొకప్రోవుగట్టికడుఁ బొల్చెడినోయనఁ జారుమౌక్తిక
ప్రవిమలదీధితిప్రతతిబల్విడి దిక్కులనాక్రమించఁగా
నవిరళలీలనొప్పు రజితాద్రిఁ గనుంగొని భక్తిమ్రొక్కుచున్ ౯౫

చ॥ అటఁజనికాంచి రవ్విభుఁ ఘలంబరచుంబిశిఖావళీవిశం
కటనటదగ్రపత్రపరికల్పిత గారుడరత్నదీధితి
స్ఫుటదివినాక్రమింపఁగడుఁజల్లని నీడలజాడకెల్ల నా
వటమువటమ్ము భూరిగణవర్గము గొల్వఁగదాని క్రిందటన్ ౯౬

కం॥ కొలువైయున్న మహామహు । నలికనయనుఁ బరమమునిజనాభ్యర్చిత ప
జ్జలజుఁ ద్రిపురారి శివును । జ్జ్వలచంద్రకలాపు నచలసమధికచాపున్ ౯౭

కం॥ కనుఁగొనియానందాశ్రులు। కనుఁగొనలందనుకఁ బులకల్ గడలుకొనఁగ్ర
న్ననఁ గేలుఁదోయిమోడిని। వినుతించిరి శక్రముఖ్యవిబుధప్రవరుల్ ౯౮

సీ॥ జయపార్వతీచిత్త జలజాతమధుకర
కరధృతశూలసద్గణనిషేవ్య
జయపరమేశ శశ్వద్భూషణభుజంగ
జంగమస్థావర జాలపోష
జయఫాలభాగలసన్నిశాకరలేఖ
లేఖసంలక్షణాలీఢకరుణ
జయసమస్తప్రపంచ స్వరూపవిహార
హారగసీరవశక్షు చారుకాయ

గీ॥ కాయభవగర్వ నిర్మూలకనకశైల
కల్పితోజ్జ్వల చాపలోకప్రదీప
భక్తమందార సంసారభయవిదూర
పాహి శ్రీవిశ్వనాథ కృపాసనా ౯౯

చతుర్విధకందము॥ శరణాగతార్తిభంజన
చరణా; పరమాత్మ విబుధజన సంభరణా
గిరిజావిభో శుభస్థిర
కరుణా, హరశేవిహీనకనదా భరణా! ౧౦౦

చ॥ అనివినుతించిపల్కిరి పురాంతక సామజదానవుండు బ
ల్మినిఁ ద్రిజగంబులన్ గసలుమించఁగ నేపుచు ధర్మమార్గభం
జన మొనరించి యేరికినసాధ్యుఁడనంగ మహాప్రతాపుఁడై
తనరుచు నేఁడు నాకము నితాంతనిరోధ మొనర్చె నుగ్రుఁడై ౧౦౧

కం॥ వానిజయించిజగంబుల । నూనదయారసముమదిని నూల్కొన బోషం
బూనుము నతాశనమణీ । శైనసుహేరణశగుఁగదాపరమేశా ౧౦౨

మ॥ అని ప్రార్థింపఁ బురాసురారి ముదితుండై యేనిదేవచ్ఛిదా
ద్దనుజున్ ద్రుంచెదఁ బొమ్ము మీర లనుచున్ దైవోత్తముల్ రంజరం
డని మాద్యద్వృషభేంద్రు నెక్కి నిశితప్రాంచత్త్రిశూలద్యుతుల్
వినువీధిన్ విలసిల్ల నేగి కనెను దుర్వృత్తాసురానీకినిన్ ౧౦౩

ఉ॥ నాకముచుట్టుముట్టి యసితాంబుధరోచులు నింగిఁ బ్రాకఁగ ను
ద్రేకము నూపు దానవులఁ దేఁకువమాఁ జొక్కని నాఁ ద్రోయఁగా
వీఁకఁ బినాక మెక్కిడి పలిస్ఫుట ఘోరశిలీముఖంబులన్
పైకొని కాల్చె దావశిఖి బర్వననీరసకాననంబులన్ ౧౦౪

చ॥ నిలకడమీరఁగా ఖణిఖణిల్లని ఱంకె హుంకరించి యు
బ్బలిత పుటాలభోతు నిజభాసురశృంగపదాహతిన్ సురా
వళులరుదంద దానవులఁ బైకొని గీఁటడఁగింపమార్గణో
జ్జ్వలపత్త్రాంబులన్ త్రిపుర వైరియు భీకమడంచె నత్తఱిన్ ౧౦౫

ఆ వె॥ హరుఁ పినాకనిర్గతాంబక జ్వాలలఁ
గ్రాఁగు ననుజసేనఁ గాంచిసురల
హర్షనినదములకమర్షముత్కర్షింప
నౌడుకఱచి వెడలె నసురవిభుఁడు ౧౦౬

చ॥ ఇరులుసృజించుమేనిచెలువేర్పడ సాంధ్యగతానురాగవి
స్ఫురణదృగంచలంబుల నపూర్వపుఁగ్రొత్తమహాంగదారకో
త్కరమనదంష్ట్రికారుచులు దాఁకొనఁ దోఁచియకాలసంధ్యనా
సురవిమతుండురోషమున శూలిసెదుర్కొనె శూలహస్తుఁడై ౧౦౭

కం॥ త్ర్యంబకుఁడవ్వేళన నే । కాంబకములఁ బ్రతిఘటించి యసురపయిఁ బినా
కంబున నెడ లేని నినా । దంబడరఁగ నేసెఁ గడఁగి దర్పంబడఁగన్ ౧౦౮

కం॥ ఉగ్రునికట్టెదురనితాం । తోగ్రుండైయసురగర్వ మొప్పనిలిచి య
వ్యగ్రగతినిశితవిశిఖస । మగ్రుండై ప్రతిఘటించె మాఱ్ఱురుదలఁకక్ ౧౦౯

కం॥ శూలిననుగర్వమేటికి । శూలంబిదెవచ్చెనని యసురవైచిన స
జ్వాలాకరాళమగునిజ । శూలంబున శివుఁడుదాని సొంపడఁగించెన్ ౧౧౦

కం॥ ఇదెకను తస్కరపతినా ॥యెదుటనునిలఁగలవె సొరగుమెటనైననుస
న్నిదమేలననుచు నసురుఁడు । గదవైచిన విశిఖమునను ఖండించెవడిన్ ౧౧౧

ఉ॥ కాలవిలంబమేల నవగాఢపుదైత్యుని త్రుళ్లడంపు మ
మ్మేలుమటంచునిర్జరులపీనరవలబుల వేగురింపఁగా
బాలశశాంకభూషణుఁ డభంగురసాధనమైనశూలమ
క్కాలిశపయిన్ వెసన్ బఱపి కూల్చెరణావని సంచలించఁగన్ ౧౧౨

వ॥ అయ్యవసరంబున ౧౧౩

కం॥ నభమున మొఱసెను సురదుం । దుభులచ్చరలాడిరపుడు తోరపుసుమసా
రభములుగురిసెను దిక్కులు । సుభగద్యుతులయ్యె జగము సుఖమంగాంచెన్

వ॥ ఇవ్విధంబున గజాసురునింబరిమార్చి సకలలోకశేగీయమానుండై యంబికా
నాథుండు కైలాసంబునకు విచ్చేయు నవసరంబున ౧౧౪

చ॥ ఇటగిరికన్నెయూడగపు టింతులుగొల్వరహస్యగోష్ఠి నొ
క్కటవిహరించుచున్ బరులు గొబ్బునలోనికి రాకయుండఁగా
చుటకొకనిన్ నిజప్రతిభసొంపునసృష్టియొనర్చి నైటివాఁ
కిఁటఁబదిలంబుగానునిచెఁ గేవలకౌతుకకేళిలోలయై ౧౧౫

ఉ॥ అంతటసామజాస్యదనుజాంతకుఁడుత్సవమొప్పనిర్జరుల్
చెంతలబంతులైబలసిసేవ యొనర్పఁగ నేగుదెంచియ
భ్యంతరసంప్రవేశనమునందు నివారితుఁడైసహింపక
త్యంతరుషానిరూషినిశితాసిహతిన్ దలఁద్రుంచె నాతనిన్. ౧౧౬

ఉ॥ కావలివానిఁద్రుంచి శశిఖండ ధరుండరుదేరఁగాంచియ
ద్దేవిమృడానియల్కసముదీర్ణముగా నిజకార్యభంగకృ
త్యావిరళాపరాధునిగ నాత్మఁ దలంచి కృతోపచారసం
భావనగాకయున్నసతిభావముఁ గన్గొనియీశుఁడంతటన్. ౧౧౭

చ॥ చని తనచేత మున్నుఘనజన్య నిపాతితుఁడైన సామజా
ననదనుజాధినాథువదనంబుబిరన్ గొనివచ్చికూర్చిచ
చ్చిన తినద్వారపాలునిసజీవుని గానొనరింపగౌరియున్
జనితపటుప్రమోదవికసద్ధృద యాంబుజయయ్యెనయ్యెడన్. ౧౧౮

ఉ॥ దేవికిఁబ్రీతిగాశివుఁడుదేవునికిన్ బ్రియమంచుగారిసం
భావనమీఱఁగానతనిఁ బట్టినిగాగ్రహియించిసర్వవి
ద్యావిసరాధినేతయు సమస్తజగత్ప్రథమార్చనీయుఁడున్
గావరమిచ్చివిఘ్నచయకర్తవు గమ్మనినిల్పిరొక్కఁటన్. ౧౧౯

వ॥ అదియాదిగా సమస్తలోకములవారికి సకలకార్యములయందుఁ బ్రథమంబున నతనిఁ బూజించుటకర్తవ్యమైయుండెనిట్లుండ నతనిజన్మదినంబగు భాద్రపద శుద్ధచతుర్థీదినంబునఁ దత్ప్రియార్థంబుగా దేవ మునిగణంబులు సమంచితా ర్చనల సంతుష్టునింజేసి పాయసాపూపమోదుకాది భక్ష్యంబులు నివేదించిన యాబొజ్జగల గుజ్జువేల్పుపొట్టనిట్టట్టుఁ బట్టులేకుండ మెండుగ నుండ్రంబుల మ్రింగి యరుదెంచునెడఁ బట్టుచాలక పొట్టసడలిన దిట్టలగు జడదారులు పాపపేరుల బంధించి రట్టియెడ ౧౨౦

చ॥ కలువలరాయఁడా తెఱఁగుఁ గన్గొని నవ్వ కృతాపహాస్యుఁడై
మెలఁగినఁబాపజంగముల మేటియుగాటపుఁగిన్కనూని యో
తులువ యిదేటగ్రల్లదము తుళ్లకుమీదినమెవ్వరేని క
న్నులనినుఁజూచినిందల మునుంగుదురూరక మాటిమాటికిన్ ౧౨౧

వ॥ అని శపియించెనది యాదిగా నెట్టివారలు నాభాద్రపద శుద్ధ చతుర్థీదినంబున
చంద్రుని గాంచిన దిలకించరాదుదు రట్టియెడ ౧౨౨

ఉ॥ ఏనొకనాడు గోష్ఠమున నేపున దోహన మాచరించుచో
మానితవైఖరిన్ గలశమధ్యపయః ప్రతిబింబితుఁ సుధా
భానునిఁ గంటిఁ దద్దురిత భంగినిఁ గల్గఁగ బోలు నీవృథా
ఖ్యానము బొంకులై చనట గల్గునె దివ్యుల శాపవాక్యముల్ ౧౨౩

ఉ॥ కావున నిందు సందియము గల్గదు మిన్నకయుండనేల నే
నీవెడ నిందలొందదగవే వెస నేగి ప్రసేనుజాడ లీ
భూకలయంబునం దెచట బొందిన నెందులనున్న రత్నముఁ
లావునఁ దెచ్చియిచ్చెద నలంఘ్యపరాక్రమ దుర్నివారతన్ ౧౨౪

వ॥ అని పలికిన జలజనాభుని పలుకుల కనుమోదంబునొంది సభాసదు లియ్య
కొనిరప్పుడు ౧౨౫

కం॥ రాముఁ సంతతనుతను । ద్రాముఁ సుగుణాభిరాము ననుజని రాముఁ
బ్రేమమున నగరరక్షణ । కామునిఁగా నిలిపి గమనకౌతుకమతియై ౧౨౬

వ॥ ఉగ్రసేనునికి విన్నవించి తదనుమతి యదునికాయానుగమ్యమానుండై సైన్య
సుగ్రీవ మేఘపుష్పవలాహకాభివాహ్యకనత్కనకమణి సుందరస్యందనంబున
మార్తాండుం డుదయశైలశిఖరంబునం బోలె నధిరోహించి భూసురాశీర్వాద
పూర్వక పుణ్యాంగనాకరకలితలలితాక్షతపరిష్కృతుండై యఖండ
తేజోనిధి వందిమాగధజయజయశబ్దంబులొలయఁ బురంబు నిర్గమించి వింధ్య
కాననమార్గంబున కరుగునెడ బొడమునాంగిక మంగళసూచకంబులకు మె
లుంగు పెట్టిన తెఱంగున ననుకూలపవనచాలనాదు లంగీకరించి ముదితుండగు
నయ్యాదువల్లభునకు గగుండను కోవిదుండిట్లనియె. ౧౨౭

కం॥ మనకు నిమిత్తము లెంతయు । ననుకూలములగుచుఁ దోఁచె నబ్జోదరకో
రిన కోర్కె కంటెమిగులఁగ । నోఁరుఁ గల్యాణమది శుభోదయమగుచున్

వ॥ అనినం బ్రముదితుండగు నమ్మధుసూదనుండు సందడి వీడ్కొలిపి సముచిత
పరివార సేవితుండై వింధ్యకాననంబు సొచ్చి యందుఁ దత్తత్ప్రదేశంబుల
నరయుచు నరుగు నవసరంబున. ౧౨౯

చ॥ తనరఁ బ్రసేనభూపుఁడటులర్థ ధరియించి విహారవైఖరిన్
వనమున కేగు దేరబల వన్మృగరాజము వానిఁ గూల్చియా
తనిమణిఁ దాల్చిపోవగను దానిని నీజనకుఁ డుచంపి తె
చ్చినదిది దీనిఁ జూచితి వె చిక్కదులాతులకుం గుమారకా ౧౪౨

కం॥ అనియూరార్చెడిపలుకులు । వినియమ్మణిఁ గనుఁగొనుటకు వికసితహృదయా
భినవప్రమోదుఁడై క । న్నదాయఁగ నేగినంద నందనుఁ డంతన్ ౧౪౩

ఉ॥ మెల్లనపొంచిపొంచి తనమేనొక యింతకుదించిసొన్నపున్
వల్లెబిగించి తోట్లకెలనన్ నవనీరశైక తస్కరుం
డల్లనఁ జేరరా నచటి యంగనభీతిలిపోవ నేగిరం
జిల్లిహరించె రత్నమతనీకుసుమాంగుఁడుద్యగహస్తుఁడై ౧౪౪

ఉ॥ ఆదనుజాపహర్త మణి నట్లుగ్రహించుఁడు నందునున్న శా
తోదరిరోదనం బెసఁగ నొత్తిలిచెప్పఁగ నాలకించి స
ద్యోదితరోష విస్ఫురణనూర్జిత శౌర్యుఁడు జాంబవంతుఁడా
శాదళనాట్టహాస విలసన్ముఖుఁడై చనుదెంచె నేత్రరన్ ౧౪౫

వ॥ అట్లు చనుదెంచి ౧౪౬

చ॥ మనమునభీతి లేక గరిమంబున నద్భుతశౌర్యసార వ
ర్తనుఁడగు నేవసించు గుహదండఁడి జొచ్చియు నంతవోక ని
మ్మణిహరియించిపోవుబలుమానిసి వెవ్వఁడవిందురమ్ము ర
మ్మనికవిసెన్ భుజాభుజి నమందసముద్ధతి నందసూతిపై ౧౪౭

చ॥ కదిసిననీడవోక నధికస్ఫురదుద్భట రోషవృత్తిన
య్యదుకులవీరుఁడచ్చవిభువయ్యెడఁ దాఁకెయుగాంత ఘూర్ణితో
దధియుగళంబువోలెఁ బదతాడన పీడనభాసమానదోః
ప్రధనవిహారనైపుణి నభంగజయాభిరతిన్ దనర్చుచున్ ౧౪౮

కం॥ బాహాబాహికచాకచి । నాహరియును జాంబవంతుఁ డతులితబలులై
నోహరిసాహంబోరిరి । యూహింపఁగ సమదవృషభ యుగళము వోలెన్ ౧౪౯

వ॥ ఇవ్విధంబున యదువల్లభ భల్లుకేంద్రులితరేతర జయాభిలాషఁ బోదలుచు సమదకలభయుగళంబునుం బోలి బెబ్బయుచు నొబ్బయుచు విరియుచు దరియు

చు గిరిగిరియును, కరికరియును, హరిహరియును, నరిమురిం బెరసిన తెఱంగున మండలభ్రమణ వేగంబున నిల్వఁగుంక సవ్యాపసవ్యపరిభ్రమణంబుల, బదతాడనపీడనముష్టిఘట్టన నిస్వనంబులు గుహాజనితప్రతిస్వనుల తోడం గలసి, రోదోంతరంబు నీరంధ్రంబు గావింప, హుంకృతి మ్రోయుచు క్రూరసర్పంబులడంబు విడంబింప ననర్గళ భుజార్గళ పరిస్ఫురణ నలౌకిక సామాన్యనైపుణ్యంబు మెఱయఁ డాసియుఁ ద్రోసియుఁ బొడచియు నొడచియు నొండొరులకుఁ బెఱుతివక నష్టాదశాహోరాత్రంబు లొక్కతెఱంగున బోరిరట్లు పోరునెడ పరస్పరఘట్టనల నొడళ్ళు పరిఫుల్లకింశుకంబులఁ బోలనెడతెగక వెడలు రుధిరప్రవాహంబులు గుహాముఖంబున వెడలె, నచట యదువీరులు పదునెనిమిది దినంబులు కాచియుండి కొండొక వార్త వినమిం జేసి ౧౧౯

ఉ॥ లోనికి నేగి రాఁడు యదులోకశిఖామణి ఘోరసంగర
ధ్వానము లొక్కటం బొదవె దైత్యకులాధము లెవ్వరని లో
నూనినకిన్క నడ్డపడి యుద్ధము సేయఁగఁ బోలు శోణితం
బీనెఱిఁ బాఱఁ జొచ్చె నిఁక నెక్కడి కృష్ణుఁడటంచు నెంచుచున్ ౧౨౦

కం॥ పదునెనిమిది దినములుగా । నిదియొక తెఱఁ గెఱుగఁబడదు హెగ్గడిదనుజుల్
బొదవినఁ బిదులం జాలక । చదిసెం గావలయునని విచారించి చనగన్. ౧౨౧

కం॥ అతిదీనులగుచు ద్వారా । వతికిం జని బంధువులకు వగ దొలుకఁగనీ
గతిఁ దెలియఁ జెప్పువారు । న్నతదుఃఖపయోధిఁ బొరలి నరయుచునుండన్

ఆ॥వె॥ ఆర్తనాద మొనఁగ నబ్ధితోయంబుల
నౌర్ధ్వదైహికంబు లాచరించి
రంతఁ జింత వోక నంగఱుగు మిగూడి
కలితశూరిభద్ర కాళిఁ జేరి ౧౨౩

కం॥ జగములు గావింపఁగ బెం । దుగఁ బెంపఁగఁ ద్రుంపఁ జాలుదువు నీవ! యనా
దిగుణోపేతవు వినుమో । భగవతి నీ క్షేమభక్తి భావులమగదే ౧౨౪

కం॥ అరయఁ బరప్రకృతివి గుణ । భరితవు నీ మహితకరుణఁ బడసినఁ ద్రిదశే
శ్వరపదవిచే యలంతియ । నరులకు నీ సేవ జీవనప్రదముగదే ౧౨౫

వ॥ అని వినుతించి ౧౨౬

కం॥ ఓతల్లి మాకుకృష్ణుని । శీతలవదనంబుఁ జూడ సిద్ధించిన సం
ప్రీతి పునరుల్లసిల్లఁగ ॥ జాతరచేసెదము నీకు జగదేకనుతా ౧౫౭

మ॥ అని ప్రార్థింపఁగ భద్రకాళికరుణైకాయత్తయై వల్లకీ
స్వనమాధుర్యము పిక్కటిల్ల ననియెన్ సంప్రీతుఁడై కృష్ణుఁడో
య్యన కాంతామణితో మణింగొనుచు రానైయున్నవాఁ డాత్మలన్
వనటం బొందకుఁ డా మహామహుని కావత్సంగతుల్ గల్గునే ౧౫౮

తే॥గీ॥ అని ప్రసాదింపయాదవులాత్మ నలరి
వాసుదేవముఖాలోకవైభవాభి
లాషులై తచ్ఛుభార్థనుసీషితముల
దినమొకయుగంబుగా నెంచి వనరుచుండ ౧౫౯

మ॥ ఇటఁ గృష్ణుండును భల్లుకేంద్రుఁడు నహీనేచ్ఛారతిన్ రోషసం
ఘటితస్ఫూర్జితతర్జనోగ్రముగ వీఁకన్ దాకి యన్యోన్యదు
ర్ఘటముష్టిప్రహతంబులన్ దెసలు గ్రుంగన్ భిన్నదేహస్రవ
త్పటురక్తప్రసృతుల్ గుహాంతరము ముంపన్ బోరి రేకాకృతిన్ ౧౬౦

ఉ॥ ఈగతిఁ బోకిపోరి బలహీనతనొందిన భల్లుకేంద్రున
య్యాగమవందనీయమహిమాఢ్యుఁ డనంతభుజాబలంబుచే
లోఁగఁగఁ దీసి ముష్టిహతులన్ బదపీడనలాచరించినన్
డాగతగర్వుఁడై సుమహిత స్థితిబుద్ధ్వనిభుండు నెమ్మదిన్ ౧౬౧

మ॥ మును నారాయణుఁ డవ్విరోచనజునిన్ మోసంబు గావింపవా
మనుఁడై ముజ్జగముల్ బదత్రియపరామర్శంబుచే నాక్రమిం
చిననాఁ డిర్వదియొక్కమారులు పరిస్ఫీతానకధ్వానమొ
ప్ప నజాండంబులఁ జాటినాఁడ దివిషత్పర్వంబుగా నుద్ధతిన్ ౧౬౨

చ॥ అదియొకకాలమున్న సముదంచితబాహుబలాభియుక్తిచేఁ
ద్రిదశవిరోధులం గొడరి నేలకుఁ గోలకుఁ దెత్తు నద్భుత
ప్రదమిదియొక్కమర్త్యునకు బాహుబలోద్ధతిఁ గోలుపోయి చి
క్కుదవిధినైదముల్గడవ గీష్పతిముఖ్యులకైన శక్యమే ౧౬౩

చ॥ ఇతఁడు మహానుభావుఁ డఖిలైకశరణ్యుఁ డనాదిమధ్యుఁ డా
శ్రితసులభుం డజేయుఁ డవిచింత్యుఁ డనంతుఁ డనప్రమేయుఁ డ
చ్యుతుఁ డగుఁ గాక నొండొరుల కుండునె యీ జగదేకమంగళా
యతనమనోజ్ఞలాంఛనము లాత్మ నెఱుంగక మోసపోయితిన్ ౧౬౪

సీ॥ సంపూర్ణపూర్ణిమాచంద్రమండలనుప్ర
సాదమై వదనంబు జానుమీఱ
ప్రత్యూషవికసితాబ్జాతపత్రసుజైత్ర
విమలవిశాలనేత్రములు దనర
ప్రావృడ్ఘనాఘనభాసమానద్యుతి
రమణీయమై శరీరంబు మెఱయ
నాశామదేభేంద్రహస్తసన్నిభములై
యాజానుబాహువు లంద మొంద

గీ॥ వెడఁదయురము సమపీనవృత్తజంఘ
లరుణకోమలపదయుగ మభినుతముగ
వెలయ నప్రాకృతమనోజ్ఞవేషుఁ డితఁడు
వాసుదేవుఁడు కాక కేవలనరుండె! ౧౬౫

చ॥ సిరితొలుకాడు మోము నతసీకుసుమద్యుతి మేను విస్ఫుర
త్స్ఫురదరవిందసుందరవిశాలవిలోచనముల్ ప్రభాతిభా
స్కరకమనీయ తేజము నుగల్గు నితండు తలంపఁ గా మహా
పురుషుఁడు సర్వవిష్టపవిభుండగు గాక మనుష్యమాత్రుఁడే. ౧౬౬

కం॥ ఈమహితుఁడు నన్నేలిన । సామియగు దశాస్యహరణచణమార్గణని
స్సీమపరాక్రముఁ డగు శ్రీ । రాముని బోలెడును సమభిరామాకృతి చేన్

వ॥ అని కృతనిశ్చయుండై కరంబులు మోడ్చి నిటలతటంబున ఘటియించి ౧౬౭

శా॥ దేవా! నిన్ను మనుష్యమాత్రునిఁగ సందేహించి నీతో భుజా
ప్రావీణ్యంబు నెలంగ యుద్ధమునకుం బైకొంటి నజ్ఞానినై
నీవీలోకములెల్లఁ గుక్షి నిడి యున్నిద్రస్థితిన్ బ్రోచు స
త్ప్రావీణ్యుఁ డవటంచు చెప్పంగ నితిని దర్పంబేది నేఁడీశ్వరా. ౧౬౮

మ॥ పరమంబైతకు నీమహామహిమలన్ బ్రహ్మాదులుం జాలరే
నరయన్ మూఢుఁడజ్ఞానహీనుఁడను తిర్యగ్జంతుమాత్రుండ దు
స్తరమౌ నీమహిమంబెఱుంగఁగలనే సర్వేశ్వరా! నన్ను స
త్కరుణాదృష్టినిజూచిసైపు మపరాధంబుల్ జగద్రక్షకా ౧౩౦

వ॥ అనివిన్నవించి కరంబులుముకుళించి యిట్లువినుతించె ౧౩౧

సీ॥ జయ విశ్వసర్గరక్షణనిబర్హణదక్ష
దక్షాదివిబుధసం స్తవవిచక్ష
జయసనకాది సత్సంయమిసంలక్ష్య
లక్ష్యచిన్మాత్ర కళాస్వభావ
జయసత్యవిజ్ఞాన సమధికసుఖరూప
రూపవిహీన నిర్లేపదీప
జయజగన్మయగుణ త్రయహేతుతాకార
కారణాత్మకపదా ధారభూత

గీ॥ జయజనార్దన దుఃఖమోచననిదాన
జయసదానంద నిఖిలరక్షకముకుంద
జయనిరీశనిరాకాశ సత్ప్రకాశ
జయపరాత్పర దురితసంచయవిదూర ౧౩౨

వైతాళీయము॥ నిగమాంత సునిశ్చితాత్మకా
జగదానందల సద్గుణాన్వితా
నగరాడ్ధర నవ్యభూషణ
ఖగితోరక్షస్సల సాధుసమ్మతా ౧౩౩

చంద్రకళా॥ వాసుదేవసనాతనదివిష్వందిత పాదసరోజయుగా
వృత్తము శ్రీసహాయజనార్దన వినతశ్రీకరతల్పిత సద్భుజగా
భూసురార్చితదానవ హరణస్ఫూర్జిత చక్రగదాధిధరా
భాసమానవిలాస సుమహిత ప్రాభవభవ్యగుణప్రకరా ౧౩౪

నిరోష్ఠ్య నరహరి జనార్దనాచ్యుత
కందము॥ కరిరక్షక సాధుచరిత కరుణాజలధీ
సరసిజలోచననందక
ధరకాంచనచేల దనుజదళనసుశీలా ౧౫౫

గోమూత్రికాబంధము కం॥ చరణానత నిర్జరసుక
విరమాకరశరదతుల్య వినుతక్షేమా
శరదనత నిత్యరక్షక
ద్విరదప్రపోషశరణతుష్టి వినతస్తోమా ౧౫౬

కందగీతగర్భిత చంపకమాల॥

నర, హరిమాధవా, విబుధ నం, ద్యరమాధిపవేదవేద్య, దై
త్యరి,పుగుణా,న్వితా, శ్రితజనావనసన్ముని సేవనీయ, శా
నుర,చరణాంబుజా,నమిత శు,భ్రధరమా, పదనాథనాథ, బం
ధురనుగుణా, భిరా,మ హితధూర్వహసంతత మంగళాత్మ, కా ౧౫౭

కందద్వయ రుగ్మవతీకమల విలసిత గర్భక్రౌంచ పదవృత్తము॥
సాగసపత్రాక్ష శుభ,సారా, జలధరనిభరుచి, సలలిత దేహా
ధీరమణీయ విధేయసు,ధీరా, తిలకితమృగమద, త్రిభువన నాథా
చారుచరిత్రా సత్యని,చారా, చలితరిపునికర, జలరుహ నాభా
భారవికోన్యాభాగుణ,వారా, బలరిపుముఖనుత, పరిచితబోధా ౧౫౮

చ॥ అనిబహుభంగినీశుఁ బరమాత్ముజనార్దను సర్వలోక పా
వనువినుతించినిక్కముగు భక్తిమనంబున గ్రమ్మదేఱ న
వ్వనచరశేఖరుండు గుణవంతుఁడుగావున మోడ్పుకేలు క్ర
న్ననిటలంబునందనర నమ్రతమాధవుఁగాంచియిట్లనున్ ౧౫౯

కం॥ అపరాధినినుఁగావుము । కృపానిధే వాసుదేవ కేశవ భువనా
ధిప యేనెంతటివాఁడను । జపలుఁడనీమహిమఁ దెలియ శక్యమెనాకున్ ౧౬౦

మ॥ వినుమున్నర్కకులంబునన్ దశరథక్ష్మాభర్తకుంబుట్టిౕ
జనసంబంధితరామనామమున సంచత్కీర్తివై యద్దశా
ననముఖ్యాసురకోటిఁద్రుంచి ముదమందన్ జేసితో దేవతా
మునిసంఘంబులనీయనూనమహిమల్ మూర్ఖుల్ గన న్నేర్తురే ౧౬౧

మ॥ అలనాఁడున్నినుగొల్చినీకరుణచే నత్యుగ్రుఁడై దేయని
ర్దళనంబేనొనరించినాఁడఁగరుణా ర్ద్రస్వాంతత్వన్ మెచ్చియి
మ్ములనన్ వాంఛితమిత్తుఁగోరుమనసం మూఢాత్మతన్ దుర్విదో
ర్బలమొప్పన్ నినుఁదాఁకిసంగరమొనర్పంగోరఁగానవ్వుచున్ ౧౬౨

ఉ॥ కరుణవరంబొసంగుటకు గాఁదలఁ పొందిన నాకు నిష్ప్రసం
గరమొనరింపరాదు విను కామితమెట్లగు నట్లు భావి ద్వా
పరమున యాదవాన్వయము పావనమై వెలుఁగన్ జనింతువ
త్తరి ననుఁ దాఁకి కయ్యము పదంపడి కల్గునటంచుఁ బల్కుచున్. ౧౭౩

కం॥ నాఁడు వరమొసఁగినాఁడవు । నేఁడా వనిదీరె నిన్న నిండోడరఁగనె
వ్వాఁడోపుఁ గావరంబున । వాడిన నాతప్పు సైపు మయ్యమహాత్మా. ౧౭౪

కం॥ భవదంగ సంగమంబునఁ । బవిత్రమయ్యెనిదె నాదు భవమెల్ల నిజం
బవనిఁ బరసవేదిక పైఁ । దవ్వుల నినుము పసిఁడియగు విధంబున ననఘా ౧౭౫

చ॥ కడు పునరబ్జగండములు గైకొని వేదిక మేడిపండ్ల క్రి
వడి నెగఁజిమ్ముచున్ మరల వానిని గూర్చుచుఁ గ్రీడసల్పు చోం
డోడయఁడు లేకయింతటికి నొక్కటనెక్కటి వేల్పులైననీ
యడుగులు గొల్చు భాగ్యము దయామతి నాకిడుమయ్య శ్రీహరీ ౧౭౬

వ॥ అని వినుతించి ౧౭౭

కం॥ తడయక పోత్రివుమనుచునపు । డడుగులఁబడి లేవకున్న నచ్ఛవిభుండా
సొడయఁడు కారుణ్యంబునఁ । గనువడి బయికెత్తి బుజ్జగంబున ననియెన్

మ॥ తల పెల్లప్పుడు నస్మదంఘ్రికమల ధ్యానైక పారీణతన్
నిలుపన్ జాలిన మేటి నీవిటు భవన్నిష్ఠానుసంధానముల్
గలయం జూచితి నాకు భక్తుఁడవు నిక్కంబీవు నీకోర్కె లే
నెలమిం దీర్చెద నాదు భక్తిమహానీయేష్టార్థముల్ గల్లవే ౧౭౮

వ॥ అనిన జాంబవంతుఁడిట్లనియె. ౧౮౦

ఉ॥ ఓ సదయాంతరంగ విను మొప్పగ నాదగు జన్మకర్మ వి
న్యాసము నాదు కోర్కె ఫలమంతయు సార్థకమొందె నన్న నీ
దాసుల దాసదాసుఁడను దాసుల దాసుఁడనంచు సతతో
ల్లాసము మీఱ నెమ్మదిఁదలంచుము క్రొమ్ముక్కెదసంబు జోదరా ౧౮౧

వ॥ అదియునుంగాక. ౧౮౨

సీ॥ కుసుమకోమలి నాదు కూతురీ కన్నియ
పలనొందు గుణరూప వైభవముల
నుతిగాంచినది జాంబవతి యను పేరున
జవరాలు మహితాభిజాత్యకలిత
దివ్యాంగనిని నీకు నిదె కాన్కయొనరింతు
నామీది కూర్మి మన్ననఁ దలిర్ప
నిల్లాలుగాఁ గొను మేలిక యిటుల న
న్నాదరించుము కరుణాలవాల

గీ॥ యనుచుఁ గేలు మోడ్చి యంగనారత్నము
గమణితో స్యమంతకమును గూర్చి
చక్రికకు బుధుకాన్క సమకూర్చి కృతకృత్య
భావుఁడై యెలర్చె భల్లవిభుఁడు ౧౯౩

వ॥ అని వినుతించి భక్తిపూర్వకంబుగా స్యమంతరత్నముతోడం గూర్చి వివిధభూషణభూషితమంగళాంగియగు నంగనారత్నము సమర్పించిన నయ్యదుకుంజరుండు తొలుకాఱు మెఱుఁగులు నందగిలి ధగధగమను మెఱుపు తీవియంబోలె మెఱయు నరవిందగంధిని ముదంబునఁ బరిగ్రహించె నంత జాంబవంతుఁడు ప్రహృష్టస్వాంతుండై ౧౯౪

కం॥ మితపరిజనసంచితయా । నతసువిహితవస్తు వితతివలను గు నిడి స
మ్మతి నను వ జాంబవతిఁ గొని । చతురగతిన్ వెడలెఁ బురికి శౌరి కృతవతిన్

కం॥ రత్నముతోఁ గన్యాజన । రత్నముతో మగుడ బురికి రాఁగని పౌరుల్
యత్నముతో నెదురుగఁ జని । నూత్నాంబుజలోచనుని గనుంగొనిరి వెసన్,

కం॥ చేఁదప్పిచనిన పెన్నిధి । నాదట మగుడంగ గాంచి యానందితులౌ
పేదలవలె ద్వారకఁ గల । యాదవులానందజలధి యందు మునుంగన్ ౧౯౭

కం॥ స్యందనము డిగ్గి యానక । దుందుభికిన్ మ్రొక్కి ప్రియము తో రామునకున్
వందనమిడి తగు తెఱఁగుల । నందఱకున్ ప్రియము నడపె నచ్యుతుఁ డంతన్

వ॥ ఇవ్విధంబున యథోచిత క్రియాకలాపంబు నిర్వర్తించి యయ్యాదవ ధూర్వహుండు రామసాత్యకి ప్రముఖ ప్రియజనానుగమ్యమానుండై భద్రగజస్కంధంబు నధిష్టించి, జాంబవతీ కన్యాలలామంబు సమున్మీలిత వ్రీడాభరావనతయై తనవామభాగంబు నలంకరింపఁ బౌరజనపరివేష్టితుండై పురరాజమార్గంబున నరుగుచు తరుణేందు నిటలలు బహువిధ మణినికరరుచి సనాథంబులగు కాంచన సౌధంబులనుండి యఱవిరి విరజాజి మొగడలతో గలిపి పులు కడగిన ముత్తెఁపు సేసప్రాలు గురియ నెడనెడ మంగళపదార్థ నీరాజన ప్రముఖోపచారంబులు నగరివార లొడఁగూర్ప నంగీకరించుచుఁ జూచు జనాలలోచనకుముదంబు లుల్లసిల్ల మందహాస చంద్రికాకందళిత వదనేందుమండలుండగుచు నిజవిజయలాభప్రసంగంబు జయభేరీముఖంబున విదితంబుగాఁ బర్వకాలసర్వతోగర్వితనిర్నిద్రసముద్రసముద్యద్రవసదృశంబుగ నవార్యతూర్యధ్వనులు మ్రోయ, నుభయపార్శ్వ విచలచ్చామరయుగళనిగుంఫిత సితద్యుతి ప్రతతి సమీపగత సౌధవలభికాఖచితచంద్రకాంతకాంతి చంద్రికలం బురణింప, సితచ్ఛత్రి వెల్లను మ్రొక్తాకలాపంబు పైపైనదనరు నీలాంబరవితానమునకు సతారనభప్రాభవం బొసంగ, వందిమాగధ కైవారంబు లుల్లసిల్ల నాదు అమదుగు నీలంబులడంబు విడంబించు గచంబులును

లికుచంబులనంబరఁగు కుచంబులునుంగల కలకంఠులు గుమ్మలైదండ లాస్యంబులునలుప ముకురకరండ కాళంజికాదిరాజచిహ్నములుఁ దాల్చికొందఱు సుందరులందండఁగొలువ నపరిమిత వైభవంబున రాజమందిరంబుసేరంజని కక్ష్యాంతరంబులు గడచి గజావతరణంబుచేసి యుచితజనంబులు వెంబడింప సాత్యకి కైదండయిడ సుందరగమనలు నీరాజనంబులెత్తఁ బూర్ణకలశాది మంగళ పదార్థంబులుదిలకించుచు సుందరమందగమనంబున నంతఃపురంబునకరిగి దేవకీదేవి చరణారవిందంబులకు వందనంబాచరించి మఱియు మానసీయులగు రుక్మిణీప్రముఖమానవతుల కుచితవచోరచననెఱపి జాంబవతీసతీ తిలకము నాక్రియుచితానేకఖచిత సౌధంబున యథోచితపరిజన యుతయై ననిచి ముదమ్మున నఖమతవిహారంబులం బ్రవర్తిల్లుచుండెనని చెప్పిన. ౧౯౯

శా॥ శేషక్ష్మాధరరాజమౌళివిలసచ్ఛృంగాగ్రహర్మ్యాంతరా
శేషశ్రీపరితోషసేవకజనశ్రేణీయుతః ప్రీదాతః క్రియో
న్మేషస్వైక్యకృపావిశేషవిలసన్నిత్యోత్సవోత్కర్షకే
యూపాంసో విభుమౌళిరత్నకిరణాభ్యుల్లాసితాంఘ్ర్యంబుజా ౨౦౦

క౦॥ బృందావనచరసేనక । బృందామచరణనిహిత బృందారకరా
ణ్మందేతరమకుటద్యుతీ । కందళకందళిత లలితకారుణ్యనిధీ ౨౦౧

మాలిని॥ చరణనిహితభూపా! సత్యనిత్యస్వరూపా!
హరదవనతపాపా! హావభావానురూపా!
శిరసిధృతకలాపా! చిత్రచిత్రప్రతాపా!
సురుచిరగుణరోపా! సుందరాకారగోపా! ౨౦౨

## గద్య

ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాప్రసాది తానవద్యకవిత్వవిద్యాభినందన
గిరిజామనోహర చరణారవింద సేవామరందబిందు బృందతుందిల
మానసేందిందిర సాలంకాయన సగోత్రజలధి చంద్రోదయా
యమాన సుబ్బరాయపౌత్ర పాపయామాత్య సంక్రం
దన నందనసహజ పాండిత్యోగేయ కవితా రమ
ణీయ సకలసుకవి విధేయ సాంబశివ
నామధేయ ప్రణీతంబగు సాత్రా
జితీ పరిణయంబున ద్వితీ
యాశ్వాసము.

# తృతీయాశ్వాసము

కం॥ శ్రీరమణీహితకౌస్తుభ । హారమణీహీరమణిసమంచితమకుటా
ద్యాభూషమహాభరణా । హారిగుణాభరణా వేంకటాచలరమణా. ౧

వ॥ అవధరింపుము. పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండిట్లనియె నట్లుగోపాలదేవుండు స్యమంతకరత్నలాభానంతరంబున రేపకడలేచి యుచితక్రియాకలాపంబులు నిర్వర్తించి బలరామసాత్యకిప్రముఖసోదరవర్గంబును, వసుదేవాక్రూరాది మాన్యజనంబులును, యుద్ధవాదిసఖులును, మఱియునుంగల యదువృష్ణిభోజాంధకవీరులును, తగురీతిఁ గొలగింప సుధర్మాభ్యంతరంబున నిండుగొలువుండి యుచితసల్లాపానంతరంబునఁ గొలువువారెల్ల వినునట్లనియె.

కం॥ వింటిరిగద సత్రాజితు । నింటస్యమంతమణియుంట నిదియదుపతికి
వ్వుంట నతఁడీయకుంటయు । వెంటఁబ్రసేనుఁడదిదాల్చి వెలలుటయుఁదగన్

కం॥ అమ్మణితోడఁబ్రసేనుఁడు । క్రమ్మరిరాకుంటయును మణిక్రైకొనెగాప
ట్యమ్మున్నమురారియనియతఁ । డిమ్మాటలు పలుకుట గును నెఱుగుదురుగదా

శా॥ మీలో మాన్యతఁగన్న నేనిటులఁద న్మిథ్యాభియోగంబునన్
జాలందూలుపడంగరాదను మనశ్శల్యంబు వేధింపఁగన్
శైలారణ్యములంబ్రసేనుని పద చ్ఛాయానుసారంబుగా
వైళం బేఁజనికంటి నాకెక్కడఁగనీ వ్యాపారునవ్వీరునిన్. ౨

మ॥ ఉరుపంచాననఘోరముష్టిహతిచే నుద్రేకముండక్కి యు
ర్వర స్రైఁగూలిన యాప్రసేనుని దదశ్వంబున్ వెసన్ జూచి యా
హరిపాదంబుల జాడగానరిగి యేనచ్చోటనుద్వేగని
ష్ఠురసంపాతము చేరఁ గూలిన హరిన్ జోద్యంబుగాఁ జూచితిన్. ౩

ఉ॥ ఆదట ఋక్షపాదగతు లచ్చటఁ గాంచి గవిన్ధ్యశైలరా
జోదరముం జొరంగఁగని యొక్కెడ మూసిమనంబు వోలె సం
ఛాదితదిక్ప్రాంగతమసంబగు నాగుహఁ జొచ్చి కార్యసం
పాదనబుద్ధినందు ననివార్యగతిం జనియంత నచ్చటన్. ౪

ఉ॥ కంటి మనోహరంబగు నొకానొక డోలికలోన బాలికన్
మింటను సుధాంశురేఖఁ బరిహాసించుచు లోచనసౌఖ్యమిచ్చు దా
ల్లంటికెఁ గేళికందుకముగా నెలకొల్పిన యాస్యమంతమున్
గంటమెఱుంగులోన గుహ సంతమసంబడఁగించి రాజిలన్. ౫

చ॥ ననుఁగని నివ్వెఱంబడు మనంబున దాదిదొలంగినిల్వ న
ల్లనఁ జని డోలికోపరి విలంబితరత్నము సంగ్రహించినన్
గని పరిచారికల్ దెలుపఁగాఁ గలుషోద్ధతిఁ జాంబవంతుఁడు
కన్కనఁ దలపడ్డఁ బోరమరె ఘూర్ణితశైలగుహాంతరాళమై. ౬

ఉ॥ పోరున నన్ని భల్లుకవిభుండు సమున్నతభక్తిఁ దార్కొనన్
జేరి ప్రణామముల్సలిపి చెచ్చెర రత్నముతోఁ గుమారితన్
గూరిచి కాన్కఁ జేసి యుపగూహన ముల్లసిలంగఁ బంపినన్
ద్వారక కిట్లు వచ్చితి భవత్ప్రియయాంచిత వైభవంబునన్. ౧౦

ఉ॥ ఒండుసిధంబునన్ మహాసముద్ధతిఁ జిక్కి కొంచుఁగ లేక కృ
ష్ణుండను హరించె రత్నమని నాల్గుఁజనంబుల విరుద్ధవాక్యముల్
దుండగి సత్రజిత్తది యదుప్రభులార! భవత్ప్రసాద మి
ట్లుండఁగ నిస్తరించితి మహోదధితుల్యమహాపవాదమున్. ౧౧

వ॥ అనియిట్లు నిజోదంతమంతయుం దాపక స్యమంతకరత్నలాభ ప్రసంగ మారథాంగళయుం డౌత్తంగించిన విని సుహృదయసింధువులగు బంధువు లనుమతించిన సత్రాజిత్తుం బిలిపించి యుచితాసీనుం గావించి స్యమంతకరత్నంబు కనకభాజనంబుననిడి యతనిముందటనుంచి యిట్లనియె. ౧౨

కం॥ ఇమ్మణి నాచేఁ బడెనని । నెమ్మది నాకశంక లేక నిందించితివా
యమ్మకలికదీఁగఁ జనియిం । ధ్యమ్మున బుజ్జనిఘనిగుహ నగసితిదీనిన్. ౧౩

తే॥ గీ॥ అతులతపసంపన్నుఁ బ్రీతుఁ డైయంబరమణి
మణియొసంగెను నీకు నిమ్మణియుఁ దప్ప
బలసదపవ్యాప్తమై భాగ్యసంతతుల ఉలె
గొనుము కష్టార్జితంబగు ధనమునెడును. ౧౪

కం॥ నావుడు సత్రాజిత్తు । దేవకీసుతుమోముఁ జక్కఁ దిలకింపక శం
కావిల మనస్కుఁడై ల । జ్జావనతాస్యుఁడయియుండె నాసభలోనన్. ౧౫

వ॥ అట్లుండి పశ్చాత్తప్తుండై యిట్లని వితర్కించె. ౧౬

ఉ॥ ఏటికిఁగాఁ బ్రసేనుఁడు ధరించి వనంబున కేగ రత్నమ
ట్లేటికి సన్యసత్వము హరించె మణిన్ రుచిలుబ్ధబుద్ధియై
బూటకమాటకోర్చి హరి పూనిహరించెనటంచు నిడునే
నేటికిఁ బల్కినాఁడ తగవే బలవంతులతోడ వైరముల్. ౧౭

కం॥ ఒంటన్ బాయదు బలిశ్రపుఁ । గంటిదె కీడాడకతనఁ గలిగినయది; వా
ల్గంటి న్నాసుత సమ్మని జంటగనిడి వేడికొనక చక్రధరువకున్. ౧౮

కం॥ కపటేమియులేని హరియెడ । నెనకొలిపితి గీడు పలుకు నిదిచాలమనో
వ్యసనమొనరించె నతనికి । మసలితి దుర్వృత్తిఁ జిక్కి నందుడనైతిన్. ౧౯

మ॥ జగదేకస్తవనీయ మంగళగుణ స్వచ్ఛస్వభావాఢ్యుఁడౌ
నిగమాధారు నుదారుఁ బెద్దలుకులన్ నిందించితిన్ దుర్జనుం
డగు నాదుష్కృతి నిష్కృతింగనునె యన్యాయుండనైతిన్ గటా
భగవంతుండిఁక నాకెసన్ గటుకృపాపారీణతన్ జూపునే. ౨౦

వ॥ అని వితర్కడోలాయమానమానసుండై సత్రాజిత్తు నిజగృహంబునకరిగి తన బంధువుల కీవిధం బుపదేశించి యుదాత్తగుణోత్తరుండగు చక్రధరుఁ గీడుపలికిన దురితంబునకు నిస్తారకంబుగాఁ దనకుమారియగు సత్యావధూమణిని మణిసహితం

బుగా గృష్ణునకుఁ గాన్క చేసి తత్ప్రసాదంబునఁ బ్రతుకునాఁడైయుండె నత్తెఱంగు కర్ణపరంపరవలన నెఱింగి మురవిరోధియు నచిరంబున సత్యాపరిరంభసుఖసంభావుకుం డగుటదలంచియుండె. నిచ్చట సత్యభామయు వాసుదేవవిలాసంబులవలని యుల్లాసంబు వేగురింపఁ గృష్ణపరిగ్రహణకుతూహలయై యుండె. ౧౦

## వసంతకాలవర్ణనము

ఉ॥ అంత వసంతముజ్జ్వల లతాంతము మన్మథశాతకేతకీ
కుంతము నూతనోల్లసిత కోకిలకాకలికానుగీతికా
క్రాంతవనాంతమావళిత గంధవహోద్భటఘాతమల్లికో
ద్వాంతపరాగధూసరనితాంతదిగంతము లింతయై తగెన్. ౧౧

కం॥ ఆమని నేమని చెప్పెద । నామతమై కోయిలలకు నరుసమొసఁగఁగ గ్రొ
మ్మామిడిచివురుల్ చైత్రుఁడు । ప్రేమన్ ద్విజతతికిఁ బిండుఁ బెట్టెడిననఁగన్.

చ॥ ఎనసినప్రేమఁ జైత్రుఁడను నిష్టసఖుం డరుదేర మెచ్చునన్
వనమహిళావసంతము విశీర్ణపటంబుల నూడ్చి క్రొంజిగుర్
దనరు కుసుంభవస్త్రములు దాల్చి తగన్ గయిసేసి నిల్చెనో
యనవిడె జీర్ణపర్ణములు నవ్యపుఁగ్రొత్త చిగుళ్ళు రాజిలెన్. ౧౨

సీ॥ లలితారుణాంశుకలాపప్రవాళముల్ దళితాబ్జరాగకందళ్ళులుగాఁగ
పలితవృంతములైన పండుటాకులగముల్ మహనీయ వైదూర్యమణులుగాఁగ
గుత్తులై బలసిన క్రొవ్విరిమొగ్గలు మగమాణిక్యపు కదంబములుగాఁగ
చిఱుతేనెలాఁబై నెఱసినదుమ్మెదల్ లాలితంబగు నింద్రనీలములుగ

గీ॥ పసరుకాయలు పసమించు పచ్చలుగద
నర్చిన గములుగాన నానామణిప్ర
కాండ ఘనులౌటఁ దెలిపెడు కరణినలరె
నఖిలభూరుహములు వసంతాగమమున. ౧౩

చ॥ దళితమణిప్రకాండ వితతద్యుతి విభ్రమ నిర్భరంబుగా
నలరెను క్రొంజిగుళ్లగుములందు వగందులకించు పూవుగు
త్తులసిరి చూడనొప్పెసఁగఁ దోరపుఁగ్రొంజిగి మేల్పయింటలో
వలిగొను గబ్బిగుబ్బచనుబంతుల వింతఁదలంపుసేయుచున్ ౧౪

కం॥ ఎలకోయిల గమిచినఁ జె । న్నలరెను లేమావిచివురు హాసుంగబలుదో
ష్కులఁ దగుఁ జెలికె మ్మోవిం । దలఁపించెన్ బాంధవవిటవితానము నెదలన్.

సీ॥ పరిఫుల్లవంజుళప్రసవాంశురింఛోళి సాహుతిజ్వాలదగ్ని సరణిగాఁగ
కమనీయ కోకిల కాకలీవాదముల్ పుణ్యాంగనాగాన పూర్తిగాఁగ
సలలితంబగు శుకశారికారవములు సంస్తుతాశీర్వచనముగాఁగ
మలయానిలాపతన్మల్లికాముకుళముల్ ప్రాలుమ్రుత్తైపు సేసబ్రాలుగాఁగ

గీ॥ దెసలఁగ్రమ్మిన విస్ఫురత్కుసుమరజము
నింపువేడుకఁగల్లు బుగ్గండిగాఁగ

నెందుభూజములను రాగకందళముల
నలయఁ జైత్రుఁడు వనలక్ష్మిఁ బెండ్లియాడె. ౨౮

ఉ॥ వేడుకతోఁ జంద్రుఁ గూడి యలివేణులు నిద్దపుఁబూవుటెరవున్
జాడలఁబూవుటమ్మదొఱ జాతరలన్ బచరించి మేనులన్
గూడిన చిమ్మచెమ్మటలు కోమలభృంగ గరుద్వ్యచాలనా
క్రీడలమించు తెమ్మెర హరించు నితాంతమనోనుకూలమై. ౨౯

సీ॥ గుత్తులై లేఁగుఫూవు గొంపుమ్మలఁజెరలాడు నెలదేఁటి సంగీతవిలసనములు
చివురుజొంపముల మచ్చికవిహారవిహరించు గండుకోయిలగుమికలకలములు
పరిపక్వఫలము లాస్వాదించుశుకముల లాలితాలాప కోలాహలములు
పనసకాయలుదిని కసఁబెక్కి నాదసేయు శారికాదారికాసరభసములు

గీ॥ మలసి రోదసి శబ్దాయమానముగని
కాంత భూమిజనామోదకారియగుచు
నమరె నశ్రాంతవికసిత కుసుమపరాగ
ధూసరములైన మధుమాసవాసరములు. 30

వ॥ ఇవ్విధంబున నితాంతామోదజనకంబై మధుమాసంబు భాసిల్లుటయును. 3౧

కం॥ ఆసమయంబున నిటస । త్యాసీమంతినియు మాధవాన్వితహృదయో
ల్లాస సమంచితనైజ వి । కాసయగుచు నెడఁద వలపు గడలుకొనంగన్. 3౨

మ॥ తలఁపెల్లప్పుడు నందనందన గుణధ్యానావధానంబుగా
నిలువన్ దస్మయచిత్తయై పులకమైనిండంగ జాబిల్లి వె
న్నెలసోకోండికఁగు నిందుమణిపుత్త్రికన్ మేనలేఁజెమ్మటల్
దలనూపన్ మరుపూలకోరికెద గందన్ జాలవేగించుచున్. 3౩

కం॥ ననవింటి వేల్పుమాయల । ఘనమెట్టిదో వనిత కెందుఁ గాంచిన నందే
గనుపట్టు నందనందను । మనోజ్ఞరూపాను భావ మహిమము తిరమై. 3౪

చ॥ ఉవిద యదుప్రవీర సుగుణోదయసంపద మాటిమాటికిన్
దవిలితలంచి తద్విరహతాపభరాలసయైనఁ బాన్పుపైన్
జివురులు వాడువాడను కృశించిన నెమ్మొయి కాకసోకినన్
శివశివ యెట్లు సైచెనొ కుశేశయలోచన మన్మథార్తికిన్. 3౫

కం॥ ఉసురనుచు లేచు వెసనలు । దెసలుంగను నశ్రులొలుక దీనతగను వె
క్కసమగ నసువులఁగాఁ జెడు । కుసుమాస్త్రపరంపరలకుఁగుందుఁగరంబున్.

తే॥ గీ॥ ఇవ్విధంబున మరుతాప మినుమడింప
నలసయైయున్న యెలనాగ చెలువుఁ జూచి
చెలిమికత్తెలు సవసవఁ జెప్పుకొనుచు
నిందుముఖిఁజేరి నెనరున నిట్టులనిరి. 3౬

ఉ॥ కన్నెవుగాని ప్రౌఢవటుగావు తలంపఁగ నీదుజవ్వనం
బెన్నఁగ గండుతేఁటి నరయింపని క్రొన్ననవంటి దిట్టినో

కీలతపంబుల్ దరులు చేకొనుచున్ దలక్రిందుగా సదా
వ్రేలెడువాలఖిల్యముని బృందమునందముసేద సేయుచున్ ౪౬

కోకిల కాకము॥ చెలువుగఁ గోకిలల్ గనిన చిన్ని కిశోరములన్
వేయఁగఁ గాకిపిండుములు పెంచినసంతమునన్
బలుకులు నేర్చినంగినుక బాటలిత్రోచెఁ గదా
తలఁపఁగ గాకకోకిలవి ధంబిది కాదె ధరన్. ౪౭

చ॥ పసిమిమెఱుంగు కాంతులొలుపై పరపొందఁగఁ జూచి చూడ్కికిం
పెసఁగెడి చంపకంబులను హేమసమూహములన్ మధువ్రతు
ల్వెసఁగొని పోవకుండమధు వీరుఁడుకట్టడ వానవ్రైనా
భసలలి ముక్తినొందికను పట్టెడుసంపఁగిఁ జూడు నెచ్చెలీ ౪౮

చ॥ ఎలమిసహస్రభూజనులకిష్టము గానన లక్ష్మిఁ జేసియిం
పలరఫలమ్ములీయఁదగు నట్టివసంతముజాజికేమొకో
కలుగఁగఁ జేయదయ్యెబుతు కౌతుకమట్టిదికాదె సద్గుణో
జ్వలుఁడగువాని చేతకుల పాంసను నెమ్మది కొక్కఁజాలునే ౪౯

తరళ॥ కలికిరో యిటుఁజూడుమల్లదె కమ్రపయ్యెరసోకునన్
దలిరువేఁతులఁ ద్రిప్పుమిన్ బమ దంబునిూఱనటించున
య్యలరుతీవియ కేలభావము లాచరించుచు నాను తో
య్యలి తెఱంగుదలంపుచేసెసు నబ్బురంబొనరింపుచున్ ౫౦

చ॥ మలయుచుఁ గ్రొంజివుళ్లనరుణంబు దులకించెడు పూపుగుత్తిపై
నొలసి కిసాలముల్లడల కొత్తుచుపయ్యెద జూడవొప్పెడున్
జలిబిలి సిగ్గునొందుచెలి సిబ్బెపు గుబ్బల జూడఁ గోరిపై
వలిపెపుపైఁటఁ దీయువిట వల్లభు నుల్లసనంబు సేయుచున్. ౫౧

వ॥ అప్పుడప్పువులోఁట యొప్పిదంబులెల్ల నప్పుడంతులు కొల్లలాడ మల్లాసంబుకేళి యుల్లంబు సముల్లసదాయల్లక భరంబున వెల్లిగొనఁ బరాయత్తచిత్తయైయున్న సాత్రాజితింగాంచి యాచింత కొంతెడిందుపఱుప నొక యరవిందగంధి యయ్యుద్యానవిలాసంబు చిత్తాకర్షణ జనకంబుగ వివిధవిషయంబులం జూపుచునిట్లనియె.

కం॥ పసుపు పెదఁజల్లునీ రే । కసవుకసుందట్టముగను గ్రమ్మినయీపై
లెసగంబచ్చలు వాపిన పసమించినపట్టుపఱుపు పఱచినలీలన్, ౫౩

మ॥ కలికీ! చూచితె చూడ్కికింపెసఁగ జాకామల్లెతీగల్ పయిన్
గలయంబ్రాకిన యల్లపందిరినిపక్కన్ జారులన్ బూవుగు
త్తులు తూఁగాడెడు వింతవన్నియలబంతుల్ వ్రేలఁగాఁగట్టి న
ట్లలకా చైత్రవిలాసమంతయుఁదిరం బైయుండెకాపుం డెడున్ ౫౪

చ॥ పొలఁతిరో చూడుమీకుదుటఁ బోదియొసర్చిన మాధవీలతన్
లలినలపొన్న దవ్వని తొలంగికుఱంగఁట నుంకుటంజుమీ
ములఁగనుదాఁ బెనంగొనియెుఁ బోనపుకొన్నపతు ల్పతు ల్లతల్
దలఁపహుమంబి చొడ్డీను దార్కొను దుండ్రుఁ సమూహనస్థలన్ ౫౫

కం॥ ఈవిధమున వనవిహృతులఁ బూవులుగోయుచును దిక్కుపాలకులు నేనుం
దీవలనుర్మ్రులవసరం బావిష్కృతిగాంచిన వనవిహారప్రహైర్లైఁ ౬౧
సీ॥ మకరకచ్ఛపవర మహితమ్మైయలకేశు కోశగృహంబనా కొమరుమిగిలి
యనిమిషాటోప నిత్యాభిరామంబుగా నమరావతీపురినను కరించి
పటుశంఖచక్రప స్ఫారామృతాకృతి నారాయణునిమూర్తి సౌరుగలిగి
యమలిన రాజహంసాళిప్రచారమై పుష్కరమై భరసూర్తిమిగిలి
గీ॥ నిత్యము క్షాత్రియత్వస ర్థితవిభూతి
భూరివైకుంఠనగరాను భూతినలరి
జీవనమునకు వాకరం జైవదాన్య
చారుసత్కీర్తిఁబోలు కాసారమొకటి॥ ౬౨
కం॥ కనుఁగొనియవ్వేఁదులు నె। మ్మనములఁగౌతుకరసంబు చల్లడిగొనఁగా
వనవిహృతిజనితఖేదా। పనయమువనవిహృతిసలుపఁ బటుగతిఁదరియన్
చం॥ వికచముఖారవిందయు సవిభ్రమదృఙ్మదచంచరీకమా
లికయుదరస్మితాతివిమలీకృతఫేనయుఁబీనరస్త న
ప్రకటరథాంగయుగ్మయు మరాళమదాలసయానయానకొలం
కు కమలవారికప్పడొడఁ గూర్చెనితాంతమనోనుకూలతన్
ఉ॥ తేనియలానమూగికొను తేఁటుల ఱెక్కల సోకుగాడ్పుపై
వానఁజలించు నంబుజదళాంగుళిసంజ్ఞలడాయఁబిల్చి య
జ్ఞానలన్ మరాళిరుతి స్వాగతమున్ దెలియంగవేడెఁజె
ల్వైనకొలంకు ప్రాసరసులై తగువారితెఱంగిదేకదా ౬౫
తే॥ గీ॥ తరుణమృగనేత్రలప్పుడ త్తమ్మికొలను
నెలమిఁదిలకించిజలకేళి కిచ్ఛగించి
తత్తడెందనకాంత ! తర్తివిూద
వసనమణిమయభూవణా వళులువెట్టు ౬౬
ఉ॥ చందురుకావిపావడలు సయ్యనఁగట్టి కొలంకుసొచ్చిసొం
పొందెడుతమ్మిమొగ్గలకు నద్దియిడందగు గుబ్బదోయిపై
కిం దలసూపనొండొరుల కేలుమృణాళములూఁతగాఁగ మె
చ్చుందనమంతరంగములఁ జొబ్బిలఁగేళివిలోలచిత్తలై ౬౭
చ॥ అలలనుడోలలందమరు నంచలఁజోపె మృణాళవల్లరుల్
గిలుబుచునిక్కుజక్కవలఁ గినలఁబాఱఁగఁదోలి తమ్ములన్
బలుపుగఁగోయుచున్ జెదరి పైకొను తేఁటుల దాటుదోలుచున్
లలనలు కేళిసల్పిరి జలంబునఁగౌతుకనీయమానలై ౬౮
చ॥ వడిగొనిముల్లియొక్కకిల వాణిక్రమంబునఁదళ్కుచెక్కులన్
మెడచనుదోయినెన్నడుము వీనికిగానగరాగనీదున
య్యెడఁదలపించెబాల్కడలి యేర్పడద్రెచ్చెకు నాడుపెందెలన్
వెడలినయిందరారమణి విభ్రమమున్ గనువిందుసేయుచున్ ౬౯

శా॥ వేశ్యాకుల్యల నెల్లఁదమ్మి నడుమన్ విన్యాణమా మిద్దెపై
తోరంబౌ మృగనాభిగూర్చి కుసుమాస్త్రుం బ్రాసి పజ్జన్ రతిన్
గీర్వాణంబు ధనుస్సు పంచశరముల్ నిర్మించి చంద్రాదులన్
వేడ్కం బార్శ్వములన్ లిఖించి మదినువ్విళ్లూరు పూజాస్పృహన్. ౧౨

కం॥ అలరులు పూవులు తేనెలు। బలితముగా సంగ్రహించి పలుదెఱఁగుల న
చ్చెలువలు మదనసపర్యా। కలితాదర చిత్తలై ప్రకాశమెలర్పన్. ౧౩

సీ॥ ఆవాహనము భువనైకమోహనునకు నాసనం బిక్షుశరాసనునకు
పాద్యమంచిత కళావైద్యమానసునకు వస్త్రముద్యలి విషమాస్త్రునకును
గంధంబు విటవిటీ సంధానధనునకు ధూపంబు మోహసందీపకునకు
దీపంబు సంసారదీపకునకును నైవేద్య మఖిలమనోహృద్యునకును

గీ॥ మహితనీరాజనము విధి మాధవాది
పూజనీయునకనుచు నప్పువ్వుబోండ్లు
నెలమి సకలోపచారములిచ్చి కోర్కె
వెలయఁబూజించి రెంతయు వినుతిచేసి. ౧౪

కం॥ విషమాస్త్ర యిడ వీవయ్యును। సుషమన్ బువుకోలఁ బురుషుల నంగనలన్
దృషితులఁ జేయుట యద్భుత। విషయంబగుఁ గాదె యలరువింటి పజీరా. ౧౫

కం॥ తెగడుచు మును మును నీతో। బగగొనె నింతియ కద కపర్ది వెనుక నీ
వెగువఁగ వీఁగి వెలందికి। సగమియ్యఁడె మేనిలోన శంబరవైరీ. ౧౬

చ॥ సకలజనప్రియా పరిచర్య యొనర్ప మరుద్గణాభినం
ద్యకలన సోముఁ డిష్టసఖుఁడై కొలువంగ సదాససద్గుణ
ప్రకట విభూతిరూప మధురంబగు ధర్మము వాను నిన్ను నే
మకలుష భక్తిగొల్తుము నిరంతర సౌఖ్యవశానుభూతికై. ౧౭

ఉ॥ మదనుని గొల్చి యిట్లు లసమాన ముదంబుధి దేలియాడుచుం
మదవతు లిష్టలీలల నమందగతిన్ విహరించువారలై బాఁ
బోదల గళన్మరందరసపూరము ద్రోలుచు సోకి సోలిప
గ్గ్యోదల విహార నామెతల మెత్తఁ జరించి రుదంచితస్థితిన్. ౧౮

వ॥ అయ్యవసరంబున. ౧౯

ఉ॥ మానసమంతయున్ లలితమాధవ దివ్యవిలాససంగరం
బై నిరవద్య మోహకలనావృతమై చెలువంగ నెంతయు నెం
దేనియుఁ బ్రీతిలేమి దలఁ నెల్లఁ దదీయగుణానుచింతనా
ధీనతమై మనోరథము చెప్పఁ దలంచెఁ గ జాలికిన్ సనె. ౨౦

ఉ॥ ఎన్నఁడొ గగ్గుల కోరివదనేందుని మోహతమంబు డిందఁగాఁ
గన్నులఁ జూతు నెన్నఁటికి నెల్లు ముకుందుని మందహాససమ్
వెన్నెల గ్రన్నన వలపు వేడిమి తాపము డంపనంచు దాఁ
గన్నుల కోర్కెముల్ వెడలి గబ్బిచనుంగవ జాఱఁ బొక్కుచున్. ౨౧

ఉ॥ తామసమేల నాత్మవసుదాత సహస్రకరుండు నిచ్చలున్
ప్రేముడిఁగూర్చునంచుఁ బగవీడి పడింపడ సంధిగోరి నె
త్తామరఁజేరి వేడెను సుధాకరబింబమనంగఁ గేలనె
వ్వామమిడె చింతనంబుపది మున్గుచు నస్త్యవిచారఖిన్నయై. ౯౨

తే॥ గీ॥ కమలలోచన నెమ్మది కమలనాభు
లీలలందుఁ గరంబు విలీనమగుచు
నిమున మొక కల్ప కల్పమై నిలుపరాని
కలవుకాఁకను వేగి కర్తిలుచునుండె. ౯౩

కం॥ ఎలజవ్వనియఁట సొబగుల । కలుకుమ ననుకూపవరుని గోరినదఁట తా
నిలుచుట వ్రాలోఁటలనఁట । వలపింతింతువుమిఁ దెలుపవశమే చెలికా. 

కం॥ కన్నియగావున దనవుది । నున్న విధం బెఱిఁగిరేని యుడిగవుటింతుల్
మిన్నరదినంతులంతటఁ । బన్నదురని యడఁగిమడఁగి పడఁతుకయుండెన్.

వ॥ అయ్యవసరంబున. ౯౪

## సూర్యాస్తమయవర్ణనము

కం॥ ఉదయాద్రిశిఖాగహ్వర । పదవివడలి యాకసమునఁ బఱచిపతంగుం
డదనెఱిఁగి యపరఋధరా । స్పదనీడాంతరమునందు బఱువిడె నొచ్చెన్. ౯౫

చ॥ చరచు మహీధరాంచిత వహంతిక నుజ్జ్వలసాంధ్యరాగసం
భురదమునొర్చి నిబ్బరముతో రవిమండల హేమపింజము
దఱియను స్వర్ణకారకుఁడు దాఁబుటమున్ సవరించి క్రాచుచున్
బరువడి నీటముంచెననఁ బశ్చిమవారిధిఁ జొచ్చె నయ్యినన్. ౯౬

తే॥ గీ॥ అనవరత చక్రరాజకుండగుచు దేజ
మెసఁగి జనమేలు నినుఁడస్తమించి నంత
గుటిలనాపాకరోదయ పటిమగలుగ
నప్పుడు భువనము బహుతమోవ్యాప్తమయ్యె. ౯౯

తే॥ గీ॥ రమణ నత్పతియగు రాజు రాకగోరి
విపుల పద్మభవాండమంటపమునందు
పట్టుగా నల్లపట్టు మేల్కట్టుగట్టి
ముత్తెములు దాపిరన బుక్షములుదనర్చె. ౧౦౦

తే॥ గీ॥ అమల శశి మండలమ్ము గర్భమునదాల్చి
యున్న పూర్వాశయను నన్ను మిన్నమోము
నందుదోఁచెడు వెలరుచాయయన. బొడుపు
మలశిఖాగ్రంబున నొకింత తెలివిమీరె. ౧౦౧

## చంద్రోదయవర్ణనము

సీ॥ ప్రాగ్దిశావనదవతీ ఫాలభాగంబునఁ గలుగొందు కుంకుమతిలకమనఁగ
యామినీ భామారోహాంతఁ గృహమున నిలుపునవ్వు దీపకళిక యనఁగ

నమృతాంధసులకు పిండామతింపఁగ సుధఁగూర్చిన సౌవర్ణకుంభిపగిది
నుదయాచలంబుననొదవు గన్నెరుశాఖఁ గొమరొందు పూవులగుత్తి యనఁగ
గీ॥ కలువలు ప్పొంగఁ గమలసంకులము క్రుంగ
గడలు వెలుఁగంగ జీకటి పొడవడంగ
జగములలరంగ లోచనోత్సవ మెసంగ
గళలు నెరయంగఁ బొడను జక్కవలగొంగ. ౧౦౨
చ॥ అరయన్ విప్రపసంట పాగ్రహీతం బైయొప్పకస్తూరి బి
త్తరపున్ ముత్తెపు మేలుకట్టుకొణిన్ దారాపరిస్ఫూర్తి ఖు
ష్కరమొప్పారెఁ దదీయమధ్యగతుఁడై చంద్రుండు రాజిల్లె భ
వ్యరుచి ప్రోజ్జ్వలదీపగర్భిత సువృత్తాదర్శగోళాకృతిన్. ౧౦౩
ఉ॥ వెన్నెలబూతఁ మేనఁదగ వేడ్క మృగాంకము దాల్చి చక్కలన్
వన్నియమించు నాప్రవతభవర్గము గొల్వ నగాగ్రచారియై
గ్రన్నన చౌమవస్యము జగంబులకున్ దనదర్శనంబిడన్
మిన్నులమించె సోముఁడు సమీక్షితదక్షసుతావమోదియై. ౧౦౪
మ॥ అనవద్యప్రసరత్ప్రసాదనిధియై యశ్రాంతసద్వృత్తిమో
హనరూపంబున నెల్లెడన్ గువలయం బామోదవందన్ సదా
ఘనమార్గంబునఁ దేజరిల్లి తమమున్ ఖండించి సత్పోషణం
డన నన్వర్థనిజాహ్వయుండగుచు దీప్యమించె రాజయ్యెడన్. ౧౦౫
చ॥ దళితసురేంద్ర నీలమణిధామ సనాథతమఃపరంపరో
జ్జ్వలయము న్నాప్రభాహమును సమ్మతిగ్గొని డాయవచ్చెనో
కిలయఁగఁబూచు తార్థలను నైకవారముమీఁదఁ జాఱుని
ర్మలరుచులన్ వియచ్చ్రదిష్యుదిరంబులఁగన్ దనరారె వెన్నెలల్. ౧౦౬
వ॥ వెండియు నప్పుడు వెన్నెల పిండమాన కాండభవకరండంబై మెండుకొని దిగ్వేదండ దంతకాంతపాండురద్యుతివితానంబులతో సహకారంబు నెరపి, పూర్వ పర్వత కటకసటులితరకానన చరద్భిల్లపల్లవాధరీ కరాకృష్యమాణ శరాసన నిర్గళి సర్గళ ద్విశిఖశిఖాభిభిన్న జరఠ వేణునాళాంత రుద్గిరన్మౌక్తిక నికరదంతురకాంతి సంతతులతోఁ బలిమిచేసి, యాగ్గిరిదరుల గిరికొను బండిగురువింద పొదలనుదల నెఱవిరిపూవుగుత్తులఁ దొలఁగు విరితేనియకాలువల తీరంబులగాఱుకొను పచ్చకప్పురపుటనంటి బొదలనురులు కప్పుపుమారుపు తిప్పలసుప్పతిలు గొప్పమల్లియ పందిరులఁ బరిసరంబులనొఱయు వకుళ వంజుళ కురువక కురంటకాది నానావిధ తరుసూనసౌరభగ్రసిష్ణు మధుకరగరుదుల్మలన జనిష్యమాణ మందానిలకిశోరంబులు పలుమాఱువీవ హాయిహాయి నెమ్మె కాంక్షఁగూడి కమ్మవిల్తుని దుకమ్మల నరుస మ్మనవోలలాడు వేల్పుగొమ్మలముద్దుమొగమ్ముల నెత్తావులు గుప్పతిలు కపురపు తిలకమ్ముల నిగనిగలతో పియ్యమ్ములండి, ద్వారకానగర సౌధాగ్రస్థాపిత కాంచన కుంభ సర్వతః ఖచితవజ్రమణిప్రభానిచయంబుల నుపచయంబుఁ బచరించి, పరి ఘూయమాన లవణార్ణవ నిర్మిదతరంగసంగగంగచ్ఛ కాంగనానిత్యపక్ష శోభాప్రతిపక్ష

శుక్తిపుటాంతరజనిత మౌక్తికదామ జాలవల్లికా విరాజమాన చంద్రకాంతమణి
హర్మ్యశిఖరాగ్ర చరిష్ణు పల్లవాధరీధమ్మిల్ల సముల్లసత్ఫుల్లమల్లికాదామంబులం దెల్ల
దనంబునం గొల్లలాడి పండువెన్నెలబయళ్లం జంద్రకాంతసౌధంబులం గ్రీడాసౌధం
బులంగూడి విందారగించు పుట్టుభోగుల బంగరుపళ్లెరంబుల నించక నించిన సముం
చితక్షీరపూరంబై, ఘుమఘుమన స్ఫుముల్లసదాయల్లక ఖరంబునన్రేగు సత్యాతరుణీ
సుకుమారశరీరలతికకుంబూయక పూసిన ఘనసారకర్దమంబై, తత్పురీవిరాజమాన
తంతువాయకశ్రేణీనిలయమాలించ భూములనగ్గంబులఘు మగ్గంబులనేయక నేసిన చలు
వమడుంగుచీరలై సుజ్ఞానిహృదయంబు పోలిక నిబిడతమోనిచ్ఛేదనధూర్వహంబై,
కౌముదీగాపున సకలపదార్థస్ఫూర్తిపరిజ్ఞానసాధనంబై, ధనవంతునిచిత్తవృత్తిమాడ్కి
సర్వతోవ్యాపనశీలంబై, వదాన్యుని వదనాంబుజంబుపోల్కి ననవరతము ప్రసన్నతా
నవద్యంబై, నిఖిలలోక చక్షురానందసౌజన్య సంధానహృద్యంబై యనూనంబై
ప్రకాశించె, నయ్యవసరంబున. ౧౦౭

తే॥ గీ॥ ఎలమి మీటిన పుడు నెచ్చెలులు నవ్య చందమున తమపోని సంశయించి
అచటు బెడవాసి వేగన యంతిపురికి గొడతెచ్చిరి వేగమంతో యుజాక్షి. ౧౦౮

వ॥ అనిచెప్ప, ౧౦౯

ఉ॥ కోకచకోరపారణ నిగుంభిత లోచనముగ్ధదీప్తిమా
లాకలనార్థ విస్ఫుట విలాసకదర్థ విముగ్ధభోగభా
క్ప్రాకట నాభికాంబురుహ భాగచతుర్ముఖమాగ్రగాన జ
ల్పాక విధాతృబంధరసభాసి జగత్పరిపూర్ణతోదరా. ౧౧౦

కం॥ పద్మాక్షపి మృదుహనన । పద్మనిభాకర బుధౌఘపాలనచతురా
ఛద్మకదసుర విసరహర । సద్మాయిత భుజగకుధర చక్రాసిధరా. ౧౧౧

కవికంఠభూషణవృత్తము॥
కరసారసాగ్రధృతకంబు గదాసిధనుస్సుదర్శనా.
పరమేష్ఠి ముఖ్యసురపాలన సత్కరుణాఢ్యదర్శనా
గరుడాంసభాగ పరిభాగపరికల్పిత భక్తసుధీమనోక్షనా
స్ఫురితాంఘ్రినూపుర విశోభిరసాయిత. శేషమోహనా.

గద్య

ఇదిశ్రీమదుమామహేశ్వర కరుణాప్రసాదితానవద్యకవిత్వ విద్యావిభాసిన
గిరిజామనోహర చరణారవింద సేవామరందమిళింద బృందతుందిల
మానసేందిందిర సాంఖ్యాయన సగోత్రజలధి చంద్రోదయా
యమాన సుబ్బారాయపౌత్ర పాపయామాత్య సంక్రం
దన నందనసహజ పాండిత్యగేయ కవితా రమ
ణీయ సకలసుకవి విధేయ సాంబశివ
నామధేయ ప్రణీతంబగు సాత్రా
జితీ పరిణయంబను తృ
తీయాశ్వాసము.

# చతుర్థాశ్వాసము

క॥ శ్రీమచ్ఛేషాద్రీంద్రల | లామాయితపక్షివిమాన లక్షితదివ్య
శ్రీమన్మంగళమూర్తి బు | ధామోదాభరణ వేంకటాచలరమణా. ౧

వ॥ అవధరింపుము. ౨

క॥ ఘనయశుఁడైన పరీక్షి | జ్జనాథుని కవలికథఁ జెంతి ఘనుఁడు వ్యా
సుని సుతుఁడు దెలిపె నిట్టుల | ద్యునదీకల్లోలరవ ఘనరతరఫణితిన్. 3

తే॥ గీ॥ కమలజాండకరండ సంకలితలలిత
విమలఘనసారచూర్ణవి భ్రమము నెఱపు
పండువెన్నెల రేసత్య భామకపుడు
వలపుతేలపుమున్కలై బైలు వాకిపాంగ. ౪

తే॥ గీ॥ తరుణిపూరువరత్నసంధానహృదయ
యగుట నవ్యవిభూషేచ్ఛ యుడుఁగెననఁగ
లలితమణిభూషణము లెల్ల శిలలటంచు
దలఁచి విడనాడె విరహసంతప్తయగుచు. ౫

క॥ ఉదరమున భువనకోటులు | కుదురైయిరవొందు హరిని కోర్కెలదలిర్పన్
మదినిలిపెఁగాన నబలకు విదితగ్లానియగుమాడ్కి వింతయొతలఁపన్. ౬

చ॥ అతులవియోగతాపదహనార్చి మనోజకలాదుఁ గొంతయున్
జతనముగాఁబుటంబిడిన చాయల దేఱు వసిండితీఁగె నా
నతివమనోహరాంగ మొక యందము దాల్చి కరంబెసంగె నీ
క్షితలమునందు రూపసులకుం గమనీయముకాటె కార్శ్యముల్॥ ౭

వ॥ ఇవ్విధంబున నంతకంతకు నితాంతమగు కలవంతమంతుగొని బహిరంతరంబుల సంతప్తంగావింప నకాంత దురంతచింతాకూపారాంతర్నిమగ్నయై మెచ్చుమీఱి క్రచ్చుఁబెంజిచ్చు సెకలతో సంగమచ్చము లిడుచున్నని వెన్నెలసోగలు సాగి మైదీఁగగదియ సైఁపఁజాలక యన్నీలాలకచిత్తంబెత్తెఱుంగునను హత్తుకొనమి నయ్యిందుమణికందళ సందర్భితమందరాళిందమున నిల్వదాళిక ప్రియాళుల పొందున కరుగక యక్కోమలి యొక్కర్తు నుద్యానగమనదోహలయై యెందు నేనియు దనడెందంబునఁ గ్రందుకొను గొందలముడిందు వడునోయని మంజుమంజీరశింజారవానురంజితసితపక్షప్రతతి యనుగమింప నవ్వనోపాంతము సేరు నెడ

సీ॥ ఏవంకఁజూచిన దావులు వెదసల్లు | నేవళంబైన క్రొమ్మావిగములు
నెదారినరిగిన పూదీవపాదరిండ | మేదురంబైన తుమ్మెదలరొదలు
నేచాయదరిసిన బూచినగొజ్జంగి | తోఁటలు గుటియూప న్నిటినదుల
నేతావు మెట్టిన నిరియునవంటుల | నునులిన పచ్చిక ప్వారపుమలలు

తే॥ గీ॥ అలన మనమెంతబిలచినఁ బలుకదాయె
నమ్మచెల్ల మనోజతాపాపహృతవి
బోధరైయున్నదీ వలపునకుమూల
మేమి యో దూరగతభావ యీలతాంగి॥

వ॥ అని

ఉ॥ ఓ మదహంసగామిని పయోరుహనేత్రి దరస్మితప్రభా
కోమలచంద్రబింబముఖి కోకిలవాణి యిదేమె నీతెఱం
గేమొవిధంబుగాఁగ విల సిల్లెదుఁ బ్రాణసమానభావలం
గామె యిదేమె మాకెఱవు గాఁదగునే వివరింపరాదటే 30

కం॥ అని పలుకరించ నుద్యత
మనోజతా పాపహృత స మగ్రవిబోధా
భినయయగుచున్న యచ్చెలిఁ
గనుఁగొని యెలనాగలధిక కంపితమతులై॥ 31

వ॥ అని విచారించుచు నయ్యంతి సంతాపం బుపశమింపఁదగు తెఱంగరయుచు శైత్యోపచారంబులు సేయుసెడ 32

ఉ॥ కోమలి నిబ్బరంపు వలి గుబ్బల జొబ్బిలఁబూసినట్టి ని
ర్ధామలయాద్రి చందన కదంబము గొజ్జగినీరుగూడఁగా
గామశిఖానిదాఘమునఁ గ్రాగపయింబయిఁ బొంగఁజొచ్చె హృ
ద్భూముదవాప్తియా వనము పొంగలిపెట్టెడు చందమొప్పఁగన్॥ 33

కం॥ పలుచలువ పనులనిటుల
న్నెలఁతలు నుభువుఘటియింప నిక్వటిలక పైఁ
దలమున్కలగుచు వలకా
కలుగదిరిన కళవళించి కన్నియలంతన్॥ 34

ఆ॥ వె॥ కుసుమవిశిఖ కువలయసఖమరుచ్ఛిక
ముఖసుఖప్రదులకు మ్రొక్కి మ్రొక్కి
సుఖవుగలుగకునికి సలఁతతో గోపించి
తిట్టఁదొడగిరపుడు దిట్టలగుచు॥ 35

మన్మథ దూషణము

కం॥ కామా! సహకారిణులము
గామా? చెలి నేఁచజయముగల్గునె నీసం
గ్రామాభీలత యిందుల
కా, మానిని చూచుటలకెగామా! భీమా॥ 36

ఉ॥ శంబరవైరిపై పటు నిశాచరసంగతిఁగూడి యాత్మదే
హం బెఱుఁగంగలేక మధు వానుగుణంబునఁ బత్తుపాత కో

టింబరిచర్యలందుఁ ఘటించి మదంబునఁ బాంథకోటిఁ దా
పంబునఁగూర్చు నిన్ను గొలుసంగను నెమ్మది సమ్మతించునే॥ ౩౭

ఉ॥ ఈషదవాప్తి సత్కళల సమీహిత తేజములార్చు చక్రి వి
ద్వేషియు సర్వరాజ నతతింగడు నాకులపాటు వెట్టుదు
ర్వేషుఁడు మిత్రులైననిఁక నింతయొకో సహవాసయోగ్యులై
దోషగుణాధవంతనఁగఁ దోయజసాయక నీ చరిత్రముల్ ॥ ౩౮

ఉ॥ లోకము లేర్చు రుద్రుని త్రిలోచనపావకుఁడంటి మంటలోఁ
బోకనిగిర్చి పాంథజన భూరిభయంకర లీలఁదోచు ని
న్నేకరణిన్ శపించిన నిఁ కేమి ఫలించు నెఱుంగకంటి నీ
పాపములింతయే మదన పాపిచిరాయువటందు రేకదా॥ ౩౯

## చంద్రోపాలంభము

ఉ॥ కన్నతనూజుఁగోఁగవి శిఖామణితోఁ బగఁబూని చెల్లె వి
ల్లున్న సహింపలేకఁ గడు పాఱఁగఁ గాంచినవానిఁ గంకమొం
దన్నులకొల్పి లోనములిసంబినఁ బొందఁజరించి సత్కళా
భ్యున్నతిమాన్చు నీకు నెన రుండునె వేఁడిన నైనరాగశశీ॥ ౪౦

కం॥ ఇట సత్కళలము నడంచుచు
కుటిలుఁడవై పసువదెంతఁగూర్చినచో ని
ల్పుటగలదె నేటిపెంపె
ల్లిటికిని రెణ్ణాళ్లపగఁటి లీలయకాదే॥ ౪౧

చ॥ జగములకెల్లఁ జుట్టమగు చక్రిహితుండును నీకుఁ దేజ మె
చ్చఁగ నసులిచ్చు మన్నెఱ సంగడికాఁడును నైనమిత్రుఁడ
చ్చుగవిలసిల్లు టోరిమిని జూడఁగ లేక నిశాటవృత్తితోఁ
దగుపగ, వానిమెచ్చులకు తమ్ముల నేఁచుట సెల్లునే శశీ॥ ౪౨

చ॥ సవసవనీడి మెచ్చుల కొసంగిఁ జెల్లెనె కాకయామినీ
ధవవినురాజనామము యథార్థముగానల నేతిబీరకా
యవిధముగాదె నీకు పరుఁడౌ నినుఁ డుల్లసిలంగ వానిమ్రో
ల వెలవెలై నికాసమెడలన్ బలిపోవఁగ నిన్నుఁజూడమే॥ ౪౩

చ॥ జలమునఁబుట్టుఁ శ్లాఘ్యట నిశాసమయంబున దీప్తిజెందుటల్
గలసిమహేశులోచనము గావుట నంటఁగరాని రూపుతోఁ
బొలుచుటఁ బాంథకోటి వెఁగబొందఁగ నేచుటఁ జూడఁగా మహా
నలసహధర్మివీవగుట నమ్మగఁ దోఁచెఁగదా నిశాకరా॥ ౪౪

## మలయానిలోపాలంభము

శా॥ దాక్షిణ్యంబువహించి నిత్యము జగత్ప్రాణుండనన్ గీర్తినై
లక్షణ్యంబెసఁగంగ విశ్వమునకెల్లం బ్రాణభూతుండవై

దక్షత్వంబుననున్న నీవుఁ దగునే దాక్షిణ్య విచ్ఛేదివై
పక్షంబింతయు లేక యంగనల నేఁపన్ గంధసంధాయకా॥ ౪౫
ఉ॥ రాణదలిర్పఁ గార్యము తిరంబుగ లోకము లేఁచునట్టి దు
ష్ప్రాణులు నైనరక్కసుల పాలికిఁ బుణ్యజనాఖ్య గల్గిన
ట్లై ణవిలోచనాతతుల కార్తియొనర్చు నీకు నీజగ
త్ప్రాణసమాఖ్య గల్గెను యథార్థముగా విపరీతలక్ష్యమై॥ ౪౬

శుకపికాద్యుపాలంభము

క॥ ఇలనేక కంఠమైతిగ్రిక్
గలికి నిమున్మునఁ బెఱిగి కాఱులఱచెదీ
చలమేల నీకుఁ బలుగా
కులతోఁ బెఱిగిన తెఱంగు కో పరభృతమా॥ ౪౭
ఆ॥ వె॥ కన్నవారివిడిచి గఱగఱఁ బోరుగిండ్ల
బెఱిగివారిచేత నెఱవుఁ జెంది
కాఱులఱచువారి కతలెల్ల నాజన్మ
మలినతాయుతక్రమనులుగావె॥ ౪౮
చ॥ తరలక కుత్తుకన్ విసము దాల్చుచుఁ బ్రముఖరాగమొప్ప భా
సురపమలాకృతిన్ సుదలు సూడెడుపల్కలఁ బల్కుచుండు నీ
తెఱఁగిది ధూర్తలక్షణము తెల్లముగాఁ గఁడులోతుగల్గు నా
సరసులలో మెలంగు నెఱజాణల చందమె రాజహంసమా॥ ౪౯

క॥ ఫలముల మెక్కుచు వనముల
సలలితముగ రామనామ జపకలమునన్
మెలగు ద్విజాగ్రణి నీవన్
గలకంఠులు వెఱువఁబలుకఁ గాఁ జెల్లునో కో। ౫౦
ఉ॥ చాలఁదలంపఁగా మలిన సంభవకాంచన దూరతాంజ
శ్శాలితలాప్పఁ బంకభవ సంగత శీధురసంబుఁ గ్రోలు చం
డాలులటంచు మిమ్ముఁగు టంగదరాజ తమోవిమూఢమా
నాళభవోదరంబు న ఘనంబుగఁ గాఱియ పెట్టు నిచ్చలున్॥ ౫౧
తే॥ గీ॥ గుట్టమిట్టలనెక్కిన మిట్టిపాఱు
వట్టియూరక పెనుకేక వెట్టె వేల
ఘనులసంగతి మనువారి మనికిఁ గెఱుచు
టనయమిదినీకు సిగుమాలిన శిఖండి॥ ౫౨
వ॥ అని పలుమఱుం దూఱి. ౫౩
సీ॥ ఒడలెఱుంగక మీదఁ బడఁజూచెదిదయేమి। మదన! నిరూపంబు మంటఁగలయ
మిన్నెక్కి శిఖిశిఖల్ పన్నఁ జూచెదవేమి। హిమకర! నీదు పెంపిఁకిఁ బోఁ

దాక్షిణ్యామెదలి భూతమకైతివిదియేమి । పవన! నీ బ్రతుకెల్ల బయలుగాను
కనులెఱ్ఱఁజేయుమఁ గాఱుకూతలి దేమి । గోయిలా! నీకొంప గూలిపోను
గీ॥ మధువుఁ గ్రోలిన పెనుమ్రోఁత మానవేమి
తుమ్మెదా! యిట్టినీ త్రుళ్లు తుప్పతెక్క
ఘనులఁ గవనోడినట్టి బింకంబదేమి
అంచనిను శ్వేతరుగ్బాధ మలమికొనను॥ ౫౪
కం॥ అనిపలుమఱు నయ్యింతులు । మనసిజ శశి శుకపికాళి మానసచరులన్
గనలున శపింపనంతట నినుఁడుదయైయెవలపుకాక యింతికిఁదోఁచెన్॥ ౫౫
కం॥ ఆళిజనులెల్లను పమ ! దాళిచికురఁ గాంచి చంచలాత్మక లగుచున్
నాళీకనాళకినలమ । ధూళీపాళికలఁజలువ దూఁకొనఁజేయన్॥ ౫౬
సీ॥ శైలస్థనియలందెఁ జందనపంకంబు । రంభోరువిడియెఁగ ప్రపురజంబు
నవలతాంగిన్వి పల్లవములు నెలకొల్పె । భసలవేణియొసంగెఁ గుసుమరసము
లావణ్యసరసియల్లనఁ గూర్చె బిసపాళిఁ । బూఁబోణియొకతె పుష్పాడి విదిర్చె
నిందువదనచిలెక్క హిమజలాసారంబు । సురభిళనిశ్వాస సురటివిసరె
గీ॥ ననుఁగుచేడియలిట్లుశైత్యాభియోగ
కరణపరిణతివెలయ నుత్కటసముద్య
దతనుపటుతాపపుటయోగ కృతనితాంత
కలితపరిహీణతను హేమ లలనకపుడు. ౫౭
తే॥గీ॥ కువలయామోదదాయియై భువిజనులకు
నెల్లశీతకరుండను నిందుఁడపుడు
తేజిచూడఁగరాక దుర్వారపటిమ
నతివకుఁగ్రశిఖామణి యగుచుఁదోఁచె ౫౮
తే॥గీ॥ తాఁ గృపీటభవుండౌటఁ దనదుసహజ
దహనగుణమెల్లమంచులోఁ దగనిమిడ్చి
పాంథకోటులపైఁజల్లు పగిదిఁదోఁచెఁ
వెడివెన్నెలగాయు నవ్విధుని జూడ ౫౯
ఆ॥వె॥ తాల్చనించుకల్లు దమ్మితూపులు దేఁటి
నారిమ్రోఁతరవళి మీరనిగుడ
నెంతుఁజూడనంద గ్రందుగాఁదోఁచెన
య్యిందుముఖికి విష్ణునందనుండు
వ॥ అప్పుడొకకొమ్మ యిట్లనియె. ౬౦
ఆ॥వె॥ మధురధర్మమూని మాధవులోఁ గొని
మారుతంబునిలిపి మనను గెలిచి
యిలవనప్రియాళి నెనసివర్తించుచు
నెగటుఁజూపు నెనుమ విశిఖయోగి. ౬౧

మ॥ నినురుద్రాక్షసమిద్ధమూర్తియన శ్రీవిశ్వభూతివిస్ఫూర్తిచే
ననయంబుల్ దగులింగధారిసతతోద్యచ్చారుసద్వ్రత్తభా
గ్యనమార్గప్రచరిష్ణుఁడైజగములన్ గంపించుసర్వజ్ఞమం
దనునింగూర్చిచెలందిరో వెలిపుబూ నన్ నీకుకార్యంబొకో ౬౩

తరలి॥ సకలభూమిజనానురాగరసప్రదుండగుచున్ మహా
శుకవి వాగ్విపులార్థవైభవ శోభియయ్యు వనప్రియ
ప్రకరగీతయశస్వియైమధురప్రచారచరిష్ణుతై
నకియరో విలసిల్లుఁజైత్రుడు సంశయంబిటులేటికిన్ ౬౪

ఆ॥వె॥ అఖిలభువనములకుఁ బ్రాణభూతుఁడుసదా
గతియుఘనులునడదు గరిమఁజూపు
నోజ్జనురభిళాత్ముఁ డురుతరదాక్షిణ్య
శీలుఁడతనిఁగూర్చి యేలబెదుర ౬౫

కం॥ ఫలమూలపత్రభోజన । కలనలవనరాసులందుఁ గడునలజడిమై
మెలఁగు శుకహంసకోకిల । కులమునకుంబెదుఁ నేల గురుకుచ! మేలా॥ ౬౬

ఆ॥ వె॥ సతతమధువిలోల చండాలులనిమడి
నలఁతవలదునిరత నాదలుబ్ధ
మతినిఁబొక్కిపద్మ మకరంద సంతృప్త
యోగవిభవయుక్తి నానరుపెట్లు॥ ౬౭

చ॥ సలలిత రామనామజపసారవచో విభవాభిరామతన్
ఫలముల నానుచున్ వనుల బాటిలితన్గని పెంచువారలన్
దలఁపక సద్విజత్వమును దాల్చి మెలంగు శుకాఖ్యయోగిప
ల్కులు శ్రుతిసమ్మతంబులని కోవిదులెల్లరనంగ నొప్పవే॥ ౬౮

కం॥ వలనాఱుతమ్ములందున్ । మెలఁగెడి సుఖవెతఁగి కవుల మేటియుశుచియై
పొలుపొందుపరమహంసకుఁ । దలఁపవిరాగంబు పరమ ధర్మంబకదా॥ ౬౯

తే॥ గీ॥ కాన నీవింకవెఱమదిఁ బూననేల
యేలతాంగులకిదివింత యేనెలంత
లంతటివిరాళిబూనిన నాడికలగు
కలఁగునెమ్మదినిలుపుమీ కలికికాన॥ ౭౦

## ప్రభాతవర్ణనము.

వ॥ అదియునుంగాక.

ఉ॥ తూరుపుదిక్కనాఁదగు వధూమణియయ్యురాకఁగోరిసిం
గారము సేయుపొంటెఁగుతు కంబునఁబావటబొట్టుదాల్చె నో
నా రుచిరాంశునిర్మలతరాకృతి వేకువచుక్కదోఁచె నం
భోరుహనేత్రలోకముఁబ్రబోధమునొందఁగ జేయుహేతువై॥ ౭౧

ఉ॥ తూరుపుకొండకందరియఁ దోఁచినచండమయూఖభాను సం
చారముఁ దెల్పుచున్ వికచ చారుసితాంబురుహంబు రేకులన్
గీరుచు నంశుజాలములు గ్రిక్కిరియన్గడుఁ దెల్విమీరుచున్
దూరుపు తెల్లవారెను వధూమణిచూడుము చింతదీఱఁగన్॥ ౬౩

ఉ॥ వలపులు గ్రుమ్మరించు చెలువమ్మున లేఁజిగురమ్ము జోదు సా
ములఁ బెనఁగాడి ముత్తెముల పోలికఁ జెమ్మటలూరఁ గౌఁగిలిం
తలనిరవొందు కాముకజనంబులు హాయిగఁ జొక్కి కూర్కఁగా
నలివలిపయ్యెరల్ సుడిసె నవ్యసుగంధగవాక్ష వీధులన్॥ ౬౪

తే.గీ॥ విరళవిరళంబులగుచుఁ బుష్కరపదంబు
నందుస్థూలములగు తార లనుకరించె
గలియుగంబుననతిపుణ్య కర్మపరుల
యునికినూటికికోటికి నొక్కఁటనుట ౬౫

మ॥ సరవిన్ దన్ను భజించుసత్కులము తేజంబెల్లఁ దూలించియే
ద్విజుఁ మిన్నందిచరించిమించితనపై నన్యుండినుండేగుదే
నెరవై బల్లములెల్లమున్ జుణఁగిపోనెంతే వివర్ణస్థితిన్
బరగెన్ జంద్రుఁ డసభ్యవర్తనులదర్పస్ఫూర్తులింతే గదా. ౬౬

చ॥ ఎనసిత్రియామయెల్లఁదన యేపునదీపితమైయెసంగగా
ననుపమకాంతి చేఁగువల యంబలరించిన రాజునన్యుఁడే
నినునకు రాజ్యమిచ్చిచన నెక్కటివీడ్కొనిపోయెదారకల్
కనుఁగొననిట్లకాదెయధి కారమువీడినవారిపోకడల్ ౬౭

కం॥ జగమునకుమిగులఁ జుట్టం । బగునిను రాకకను బ్రాచి యలరుచురచ్చన్
దగబలిచినకెంబట్టుతె । అఁగుఁదోఁపఁగనరుణరుచి కరంబలరారెన్. ౬౮

చ॥ మెడగదలించినిక్కినిడు మేనువిదుర్చుచుఁ జంచుకోటిచే
గుడుసులుదీఱ ఱెక్కలను గోకియొకించుకచిక్కవాపిన
ల్గడలనుజూచియుద్గమన కౌతుక మేర్పడఁగాఁగులాయముల్
వెడలెవిహంగముల్ రుతులు వీనులకింపుకరంబు వెంపఁగన్. ౬౯

ఉ॥ ఆహరిదశ్వరాకఁగని యడ్డముదాఁకి పెనంగవచ్చుమం
దేహనిశాటదేహముల నిష్ఠల బ్రాహ్మణులిచ్చునాగమ
వ్యాహృతిసంచితార్ఘ్యయుత వార్లవవ్రజహతిన్ స్రవించున
వ్యాహతశోణితప్రస్ఫుతు లైతగెసాంధ్యనవారుణద్యుతుల్ ౭౦

చ॥ కరములు వేయిలెక్కయిడఁ గాఁగుతుకంబునఁ బ్రొద్దుగ్రుంకుచో
నరుదుగనాత్మపత్రనిక రాంగుళులన్ గ్రమయుక్తివంచి క్ర
మ్మఱనుదయించఁగాఁ గణనకై యొకటొక్కటిచాఁచుపోల్కఁగా
సరసిజముల్ క్రమక్రమవళంబులుగా వికసించెనియ్యెడన్. ౭౧

ఉ॥ అనయము నైల్యవృత్తిమధు పానుగుణంబునుఁ జూచి రాజునె

ట్టనపయోజోదరంబుల దిటంబుగఁ గాఁటియఁ బట్టఁ జిక్కియుం
డు నెడ జగంబు విందని కడుం దగునయ్యినుఁ డేగుదెంచు వే
ళ్కను విడిపుచ్చిరో యనఁగఁ గంజములన్ వెడలెన్ ద్విరేఫముల్. ౧౨

ఉ॥ వేఁగిన సంగతంబులయి విచ్చు చనొండొకటిం బెనంగి జో
డై గరువంపు జక్కవ లహర్ముఖవేళల సజ్జనక్రియా
భ్యాగతవిప్రపుంజముల కాత్మఁ దలంపఁగఁ జేసె స్వీయకాం
తాగురు కుంకుమాంకితమిథఃకమనాస్తన యుగ్మసంగతుల్॥ ౧౩

చ॥ ఖరకరుఁడో నినుండొగి జగంబుల శేల్బడి సేయవచ్చునం
చెఱిఁగి యథార్థవర్తనవహించె జగంబునఁ దద్దమంబు, ని
ర్భరమగు దెల్వినెక్కొనియె, బాసిచనెన్ జడతాప్రచారముల్
ధరనిటుగాదె తేజమును దాల్చినరేని ప్రభుత్వపద్ధతిన్॥ ౧౪

కం॥ తూరుపునాడే లెడు దొర । తీరగు మేడ నుడమిసీమి దేవాకుబలుబం
గారపు కుంభము పోలిక । సారసహితమండలం బెసంగుచుఁ దోఁచెన్॥ ౧౫

చ॥ అలమి జగంబుఁ బైకొనిన యంధతమఃప్రకరాసురావళిన్
దలఁచి తదీయనిర్దళనతాకలనంబునకై జగద్విభుం
డల మధుసూదనుండు వెస నంపు సుదర్శనచక్ర మోయనన్
జలరుహబంధుమండల మెసంగి సముద్గతమయ్యెఁ దూర్పునన్॥ ౧౬

మ॥ అరయన్ సర్వజగన్మయాకృతియుతుం డైమించు నారాయణుం
డిరువై దాల్చిన శంఖచక్రములు నానింపై ప్రకాశించెన
వ్వరుణేంద్రాశలఁ జంద్రభాస్కరుల బింబంబుల్ ప్రభాతంబునన్
సరవిన్ బాండురలోహితద్యుతులతోఁ జక్షుఃప్రియంబై తగన్॥ ౧౭

తే॥ గీ॥ అతులనిద్రాజడంబయి నట్టి జగము
గడుప్రబోధంబు నొందగాఁ దడవిసమయ
వైద్యుఁ డిడిన రసాయనా వద్యఘుటిక
యనఁగ విలసిల్లె సూర్యుఁడ య్యవసరమున॥ ౧౮

సీ॥ ఉదయభూధరతటాభ్యుదితగైరికధాతు । చటులద్యుతులతోడ సరసమాడి
స్వారాణ్మతంగజాంచత్కుంభసంభృత । యావకరుచులతో నవఁగిపెనఁగి
మిన్నేటిదరులనెమ్మిఁ జరించు మునులకెం । జడలకాంతులతోడ జంపునడపి
నందనోద్యానమందలి కల్పతరువుల । చివురుజొంపములతో జెలిమిసలిపి

గీ॥ పూర్వవారాశితీరసంభూతలలిత
విద్రుమలతాంశువితతితో వియ్యమంది
ప్రౌఢబంధూకకుసుమశోభానిభంబు
లగుచు విలసిల్లెనపుడు బాలాతపములు॥ ౧౯

సీ॥ మునిపల్లెలందు నిమ్ముగఁ జెట్లకొమ్మల గట్టకట్టు నీరాకవులగుచు
వనగజప్రతతి కుంభమ్ముల బెట్టక పెట్టు నిద్దపు జొత్తు పట్టెలగుచు

వెలువడుగుబ్బెతల పాలిండ్లపై బూయక పూసిన కుంకుమ పూఁతలగుచు
దొడ్డిక్రంచెలను వెూదుగుచెట్లఁ బూయక పూసిన జగజంపు పూవులగుచు
గీ॥ పల్లెఱచ్చలఁ బఱువక పఱచినట్టి
బలువు కెంపవన్నె రత్నకంబళములగుచు
పొలుపుగులికెడు నిర్వేళఁ బొరిదుపొడుపు
టింపునీరెండ తళతళ లేపునీరజా॥ ౯౦

వ॥ అనిచెప్పి

క౦॥ లేలెమ్మ యింతవింత విరాళిఁగొనందగదు నీ తెఱఁగెఱిగినచో
గేలియొనర్చెద రింతులు బాలరొ పైకనుగవలపు పాటించవలెన్॥ ౯౧

క౦॥ కలికిరొ చెలువునిపైనిటు వలపుచుదిన్నలిఫి మిగుల వంతలుగనుటన్
లలనకుఁ దగదట్లయినన్ జులకనగాఁజూతు రీసు సుందరులెల్లన్॥ ౯౨

క౦॥ అనుటయు సత్యాసతి నెమ్మనమొక్క తెఱంగుగాఁగ మరలించికడున్
గొనలిడు విరాళిలోలో ననువుగ నెలకొల్పి చెలుల కభిముఖయగుచున్॥ ౯౩

క౦॥ చెలులార మీరుచెప్పిన పలుకులు నిక్కమగు నైన భావజుఁడెంతో
ఖలపాదివానిమాయల కలవునఁ జిక్కక మెలంగ నలవియె నాకున్॥ ౯౪

ఆ॥ వె॥ మదినిలువదెందు నిదియేమి మాయయొక్కొ
చెలియ మీరాడుపలుకులు చెవినిసోక
వకట కన్నులఁగట్టిన యట్లు ప్రియుని
యందమెచ్చోటఁజూచిన నందెతోఁచు॥ ౯౫

తే॥గీ॥ చెలియయీమాయవలనెట్లు గలిగెనమ్మ
తాళగాఁజాలమతునికాం తాళమునకు
ప్రాణవల్లభుఁడింకఁజే పట్టకున్న
తలఁచుకొనరమ్మనాదువ్ర త్రాంతమెల్ల ౯౬

చ॥ చెలియరొ ప్రాణవల్లభుని చిత్తమురంజిలనిందుకౌగిఁటన్
మెలఁగుచుఁగోర్కెలన్నియు సమేలముగాఁగొనలందనిచ్చలున్.
కలఁగఁగనోఁచలేనియల చిత్తరుబొమ్మమనోజ్ఞరూపమున్
తెలువముజవ్వనంబడవిఁ జెందిన కన్నెలగాదెచూడఁగన్. ౯౭

ఉ॥ ఏమరొ! నేనునోఁచితినొ లేదొ యెఱుంగఁగఁజాలనక్కటా
కామిడిదైవమేదితుది గానొసరించునొ యాదవాన్వయ
గ్రామణినాయెడన్గరుణ గాంచునొ కాంచఁడొ యీమనోజతా
పామితవార్ధిపార మెుక యప్పుడుగందునొ కాననోకదే. ౯౮

వ॥ అనిపలికి ౧౦౦

చ॥ జిలిబిలిముద్దుమోమునతన చేలచెఱంగునఁగప్పికన్నులన్
జలజలనశ్రుబిందువులు జాల్కొనిచన్నులమీఁదజిందఁగా

కలవరమందియేడ్చెకల కంఠి సపంచపు కాకలీశ్రుతిన్
గులుకుశరాళిమేళనముఁ గూర్చివిపంచికలస్వనంబునన్ ౧౦౧

వ॥ అప్పుడు నెచ్చెలులగు ముద్దరాండ్రు డెందంబులం గొందలంబుగదుర నమ్మ
దవతిం బోదివిపట్టి ౧౦౨

చ॥ ఇటులగునమ్మకన్నెపు సుమాళలవంతలఁగాంచినెమ్మదిన్
దిటముకయింతగైకొనక దీఁతనొందుటనెందువింటిమే
కటకట ప్రాజ్ఞవీవెఱుఁగ గానిదిగల్గునెచోర్చుమమ్మమి
క్కుటముగనీవిటుల్ వగవ గాఁగనిసైతుమటమ్మమానినీ ౧౦౩

చ॥ సరసుఁడు గోపికాహృదయ జారుఁడు నీదువిలాససంపదల్
మురువునవాలకించిమది మోహమునెక్కొననిచ్చగైకొనన్
గరముసుకృత్తినుండెనని కంజదళాక్షిరో విందమెట్లునీ
సరసమనోరథంబుఫల సంగతిగాంచుటతథ్యమేకదా ౧౦౪

మ॥ హరినీపైనను రాగయోగమున మాద్యచ్చిత్తుఁడైయుండుటల్
తరుణీతథ్యముగాననీవిధములన్ దార్కొణగానీమనో
హరునింగూరిచి వాచికంబనుపమే లౌనిట్లుగావించుటల్
సరణుల్ నాయకనాయకీఘటనలకున్ సంధానకార్యంబులన్ ౧౦౫

వ॥ అనిచెప్పి ౧౦౬

కం॥ కీరవసుధాసమంచిత । గిరవుమంజులగరుత్వ గీరమణీమా
కారమయుపజనులకుసహా । కారమనగుదొండొరులఁదగంగపగూర్పన్.

కం॥ రతికిని భారతికిని శ్రీ సతికిని హేమవతికింపు సమకొల్పుచుఁద
త్పతులంగూరిచి కడుస । త్కృతులంగను జాణలటగదే మాపెద్దల్॥ ౧౦౭

కం॥ శుకమా! చంచూజితశుకిం । శుకమా! నినుఁబెంచి మురువుఁబూచెడుచెలియ
చ్చికదీఱఁ దత్పతికనిపు । డొకసందేశమ్ముగొంచు నొగిఁజనవలయున్॥

వ॥ అని క్రీడాశుకంబుఁ బ్రార్థించి సత్యభామతో నిట్లనిరి. ౧౧౦

చ॥ చెలియరొనేఁడునీవుదిని సిగ్గనిమొగ్గనఁజూడఁబోకనీ
వలపుతెఱంగు వెల్లముగ వ్రాయుము లేఖఁ బ్రియంబుమీఱ నీ
చిలుకభవన్మనోహరుని చెంతకు నేగియొసంగి తన్మనః
కలనమెఱింగివచ్చినను గౌతుకవారిధిఁ దేల్చు గన్గొనన్। ౧౧౧

చ॥ అనవుడు క్రొత్తసిగ్గుతెఱ లప్పుడుగొంతరలై మనంబునన్
బెనఁగొన మోమువాంచి యలివేణులు నన్నిటు గేలిసేయఁగా
జనునె యటుండరమ్మయిఁక జాణతనంబులు సాలునెందునున్
గననభిజాత్యధన్యలకు కన్యలకిట్లొనరింపఁజెల్లునే॥ ౧౧౨

చ॥ చెలువులకెందు వల్లభుల చిత్తమెఱుంగకమున్న తారయై
తలఁపుతెఱంగుఁ దెల్పుటుచితంబయయైన పడంతి చేలయై

ఝలకనగాదె మీరలిది చూడక యాడెదరింక నెమ్మదిన్
గలఁకదొలంగి చిత్తజుని కల్కుల కుంగుటె యయ్యెదందఱన్॥ ౧౧౩

వ॥ అనిన నచ్చెలికత్తె లిట్లనిరి. ౧౧౪

చ॥ కులుకు మిటారి యిత్తెఱఁగు క్రొత్తది యేయువ పాలఁ గెందు నన్
గలయ దెకాదె నీకెలుక గాదొక ప్రేమను రాజహంసి చే
నలదమయంతు లాత్మకలనంబు లెఱుఁగరె నేఁడు రుక్మిణీ
నళినదళాక్షి ప్రోవలనన్ హరికిన్ దనకోర్కి దెల్పదే ౧౧౫

ఉ॥ కావున నాదు సందియము కైకొనఁగాఁబని లేదు నీమనో
భావము డాచి చిత్తజుని బారికి నగ్గముగాఁగఁ జెల్లదీ
వీవిధమెల్లఁ గృష్ణునకు నేర్పడ వాచిక మంపు కార్యసం
భావనయంత వీడదట శుభంబగు నో మదహంసగామినీ॥ ౧౧౬

కం॥ అనిచెలికత్తెలు చెప్పిన । వని చిత్తముకలఁకదీఱి వెలఁదుక హరికిన్
దనకోర్కెఁ దెలుప నెన్నిన । ననువుగ నన్యార్థభావ కైతగవానన్॥ ౧౧౭

చ॥ కనికరమింత లేక మదిఁ గట్టుకదాఁకొని శంబరారి పా
చినకలకంఠకోలగుటి చేసెఁగటా పురుషోత్తమాఖ్యకై
కొనిన భవన్మనోజ్ఞమున కున్ గలిగింపక యుండు నేదయా
భినయమి సుంత నిక్కముగ భీతమృగేక్షణ భ్రమస్థితుల్ ౧౧౮

తే॥గీ॥ అని శుకోదర సురుచి పూర్ణ మైనయట్టి
విమలకమలదళంబుపై వ్రాసలిఖించి
ముడిచి చీనాంశుకము చుట్టి ముద్రవెట్టి
నెచ్చెలుల చేతికిచ్చె నా నీలవేణి ౧౧౯

వ॥ అప్పుడప్పద్మముఖులాకమ్మ నెమ్మదింగైకొని ౧౨౦

సీ॥ కండచక్కెర తోడఁగలసి మేలవించిన । మేలిపండ్లేరియా మెతలొసంగి
తలిరులఁబోలు మెత్తని కేలుదమ్ముల । నవయశంబులను బ్రియమున నిమిరి
నిండఁబండిన దొండపండు బెండొనరించు । మోవి ముక్కున వాన ముద్దువెట్టి
పంచదారల నేరగించు తీయదనంపు । ముద్దుమాటలె సంగ ముచ్చటాడి

గీ॥ పొంకమలరంగ నొకకొంత బుజ్జగించి
కమ్మఁజూపించి యలుగోళ్ళ నిక్కముగ నట్టి
పోయి శ్రీకృష్ణునకొసంగి పొసఁగ మాటు
కమ్మ దెమ్మని చిలుకకుఁ గఱపి పుచ్చి ౧౨౧

వ॥ ఇవ్విధంబున నాపువ్వుఁబోఁడులనిచిన నాచిలుక కులుకులొలుకు గరుడపచ్చల ఱెక్కల చెలఁగఁదొడ్కు నెక్కలుల్లార్చి యుల్లాసంబున నింటికెగసి పొగడందగు నగధరునంతికోద్యానము దారికింపాఱి చెలువుమీఱు నయ్యేలదోఁటసొచ్చి యందు నందంబులొప్పు మాతృగమానికంబు లధంబున విడంబించు కుందనపుటాటుమల పొం

దునగడుందులకించు బంగరుతమ్మిపూవులకుఁ గావగు కొలని కెలన చలువలొలుకు గపు
రపుటనఁటి బోదెలఁగాఁజుకొను సంపఁగెపూవుటీరంబుల చేరువ చందమామ తాలఁ
దీటిచినవసంత మందిరంబు చెంగట నిరవొందు సురపొన్నతరువుపై నధివసించి
నయ్యవసరంబున. ౧౨౨

మ॥ కదలం బారుదిటంబు చిత్తమునఁ జిక్కంబట్టి సత్యాకథా
నువృథోరోజయుగోసగూహనరసోచ్చాధనంబులై కోరికల్
మదిలో నీరికలెత్త నన్యవిషయోల్లాసంబులే కెమ్మెయిన్.
బ్రిదులం జాలని కూర్మి నేకతమునన్ గృష్ణుండు క్రీడారతిన్. ౧౨౩

ఉ॥ సారణుఁడన్న నన్నుసఖు సన్మతితోఁ గయిదండఁ బూని కం
సారి మనోజతాపనిహితాశయుఁడై నిజనిష్కుటాంతరో
దారవిలాసదర్శనవిధంబున నైనయొకింత చిత్తమో
దారిచి కొంటకై వెడలి తానటకుంజనుదెంచె నంతటన్ ౧౨౪

వ॥ అట్లు వచ్చి తద్వనరామణీయకంబును సూచి యనుంగు చెలికాని కిట్లనియె॥

సీ॥ తలపించె నీలేఁత తలిరుకొన్నెన్నన రెల్ల తెలువ చక్కనిమేని తీవసొబగు
గుజిమాపె నీవింత కొన్నిగ్వారిగుత్తులు కులుకుమిటారి గుబ్బలబెడంగు
తలకొల్పె నీచక్కఁదనంపు బింబఫలంబు ముద్దులగుమ్మ నెమ్మోవిఠీవి
సాటిగాఁజాటె నీబోటి తేఁటులరాటు తరుణేందుముఖి కుటలపెందురుము పెరిమె

గీ॥ మనసుమఱపించె నేకప్రిపసఁటిబోఁడ
ఉడరుజిగిగుల్కు నింతి పెందొడలసౌరు
డెందమునలంత యొకకొంత డందువరుప
నిందుజేరిన నదిపృద్ధి నొందఁజేసె॥ ౧౨౫

మ॥ అకటా డెందము గందఁజేసెఁగద నిర్యోగామవాటీసును
ప్రికరోదగ్రిమరందపానమదశుంభచ్చంచరీకాళి?
సుకలారావగుణధ్వనుల్వెలయఁగాఁ జూతాంకురోగ్రాస్త్రముల్
నికరంబై జడిఁగ్రిమ్మ దర్పకునియున్మేషంబుఁ బాటించుచున్॥ ౧౨౬

ఉ॥ చిత్తరువ్రాసి మెచ్చఁగయి సేసి మనోహరవస్తుకోటియం
దుత్తమరూపవైభవము నుల్లమునం గడు నాహరించి తా
దత్తదుదంచితాంగ కలితంబులుగా నొనరించి ధాతయా
పుత్తడిమేలిబొమ్మ కసువుల్ దగఁబోసెనొ నాఁగఁదోఁచెఁ గన్॥ ౧౨౭

ఉ॥ చక్కఁదనంబులన్నియును బో సంగఁగఁజేసి తిలోత్తమాఖ్యఁ దెం
పెక్కఁగఁజేసి చేతియఱు వెల్లనుదీటి సృజించఁబోలు నీ
చక్కరబొమ్మ నా సరసిజాసనుఁ డేర్పడ సృష్టికౌశలం
బెక్కుడి రూపసంపద గణింపఁగ శక్యమె నాకు నెచ్చెలీ॥ ౧౨౮

ఉ॥ అందపుచందమామ సుధనచ్చపుశారద వారిదగ్రిమం
దుందులకించు క్రొమ్మొయిలుతోఁదులదూఁగఁగ నాదు మక్కికిన్

పిందుగఁదోఁచి నామదిని నెక్కొనియున్న దిటంబు సర్వముల్
జిందరవందరై చెదరఁ జేసిన యాచెలిఁ జూచు టెన్నఁడో॥ ౧౩౦

కం॥ అనినర్మసఖునితోఁ దన । మనసుతెలంగెలుకపలుచి మాటాడుచున
వ్వనజాక్షుండు వసంతభవనముంజేరంగ నటకు వచ్చియుదమునన్॥ ౧౩౧

వ॥ అచ్చోటఁ దగుచందు ఱాతిన్నియపై నధివసించిన యవసరంబునఁ దదుపాంత పున్నాగ భూజాంతర్వర్తియగు శుకోత్తమంబు మధురాలాపంబుల నిట్లనియె ౧౩౨

కం॥ ఫలముల మెక్కుచు వనముల । మెలఁగిద్విజాగ్రణియనంగ మేలొందినయా
ఫలము చరితార్థమగు మం । గళరూపుని నిన్నుజూడఁ గంటి మహాత్మా ౧౩౩

కం॥ ఆనిపలుక దదాలాపము లనుమోదముతోడ వినిప్రి । యమునబ్బాముల్
బెనఁగొనఁదత్తరుశాఖను । గని చిలుకను మెచ్చి యదుశిఖామణియంతన్॥

తే॥ గీ॥ ఓసిముద్దులచిలుక! నీ వెవ్వలాలుకు
పలుకులకుదోఁడు మానవ భాషణప్ర
కారవైచిత్ర్యమరయ నక్కజముమాకుఁ
జాటువెట్టక తెలుపునీ చరితమెల్ల॥ ౧౩౫

వ॥ అనియడిగినఁ జిలుకయిట్లనియె ౧౩౬

తే॥ గీ॥ ప్రాంతమినుకులకోనపని బాలునకును
నిలువనిమ్మగు చిపురంకు గలుగుమఱ్ఱి
కోటరంబునమునుగల్గై నేటిమీఱు
చిలుకమిథునమ్ము మెచ్చులు చిలుకుచుండ॥ ౧౩౭

తే॥ గీ॥ అందుమగచిలుకమరునివాహనము గాఁగ
వలరికడుమెచ్చగనిరొ నయ్యాడుచిలుక
వలతియైయెల్లకళల నవ్వాగ్వధూటి
కరసరోజమునకునలంకారమయ్యె॥ ౧౩౮

కం॥ ఆమిథునముకారణమున । నీమహిజనియించినార మిరువురముగుణో
ద్దామపులోమజచెంగటఁ । దాపనుమాయక్కసంతతము వాణియవన్॥ ౧౩౯

కం॥ దానికిఁగనిష్ఠయసినినే । నో నిర్మలరూపజగతి నురుసౌందర్య
శ్రీనిధియగు సాత్రాజితి । చేనుపలాలనముగనివసించెదనచటన్॥ ౧౪౧

వ॥ నాపేరు ప్రియవాణియని యమ్ముద్దులగుమ్మ పిలుచుచుండునది. యట్లుండ నిమ్మ. నేను పలుమాఱు మదీయాగ్రజాదర్శనలాలసనై యమరావతి కరుగుచుండు నప్పు డందలి సురయువతుల లావణ్యాతిశయంబులెల్లఁ దప్పక నొప్పరికించి చూచి నాచెలిమికత్తెయగు సాత్రాజితిరూపవైభవంబునందు కోటితమాంశంబునకైన సాటి గారని తలంచి వారలముందు తదీయ సుషమావిర్భవిశేషంబులు కైవారంబులు చేయుచుందు. నప్పని కేమిగాని నాచూచినవాలందిక మదనరతీదేవులను రంభానల కూబరులను జోడుగూర్చిన ప్రోడయగు నగుమొగంబుల జియ్యా తనసృష్టికి మిన్న

దనంబుచే మోపిన సాత్రాజితికి నిన్నుంగూరిచికదా చరితార్థుండయ్యెడునని యుపాహారంబు దలపోయుచు నేతదర్థంబు సత్యాసతిముందు భవదీయసౌందర్యంబు నభివర్ణించితి. అందువలన నాయెలనాగయుఁ దలఁపు నీపై నిలిచి మనోజకుసుమసాయకంబులకు గుఱియైనఁ గడవస్థావిశేషంబు దేవరకెఱుకపఱచి యంగీకారంబునడయుదునని యక్కన్నియ సందేశంబుగైకొని యిటకువచ్చితి నిదె యాకొమ్మవ్రాసిన కమ్మ గైకొమ్మని పున్నాగకుసుమగుచ్ఛప్రదానపూర్వకంబుగ నొసంగినం గొని కృష్ణుండు చదివికొని యందలి గూఢార్థసందర్భమునకుఁ దలయూఁచి యాచెలువ సాహితీవైచిత్ర్యంబు మెచ్చి యచ్చిలుక కిట్లనియె. ౧౪౧

మ. చిలుకా మీచెలి యంత నేర్పరియొ నొగాజింపంగఁ దద్వీక్షణ
చ్చలరంధ్రంబున మారచోరుఁడు మదంచచ్చిత్తదుర్గంబు నే
ర్పలరం జొచ్చియు ధైర్యవిత్తము హరింపన్ బొంచియుండంగ నా
వలనన్ దాలిమిబూని నాదు దనభావంబిట్లు డాప్పెడిన్. ౧౪౨

చ. అలవున నెల్లలోకముల నానిజయానమునఁ జేర్మినొందఁగా
బలియుఁడనయ్యు మీచెలిని భావనఁ దలపోసినందుచే
నలవలరాచవానియలగంపఱ పెంపునకో హటించితిన్
జిలుకరో యింత మీచెలికిఁ జెప్పగదే దయమద్విధంబులన్ ౧౪౩

తే. గీ. కులుకుగుబ్బెత సిబ్బెపుగుబ్బదోయి। దలఁచితలఁచి తదుపలబ్ధి కెలమిగోరి
నవసివేగించుచుండెదు నాదునకిల। వాసరములయ్యెఁజుమిగురువాసరములు.

తే. గీ. కలదు లేదని బహుభంగిఁ బలుకనేల। నాసుదియుఁ ఱుంగ లేవె విన్నాణివీవు
కూరిమితలంచియు వ్వేరులూరుచుండు। మమ్ముననిరుపరఁగూర్పు నేమగుగునీకు.

తే. గీ. ఎద్దియోయుపాయమొకటి పన్నించియచిర
కాలమునఁదత్పరీరంభకేళిఁ దేలు
కుతుకమునన్న వాఁడ నంచతివతోఁడ
హితముమీఱంగ నెఱిఁగించు మీవుచిలుక ౧౪౬

వ. అనిచెప్పి ౧౪౭

సీ. స్వస్తిశ్రీరస్తు సౌభాగ్యవతియగుసా। త్రాజితికభిమతో దయసమృద్ధి
గలుగదీపించి చక్రధరుండువ్రాసిన। శుభలేఖ, నేనిన్ను జూచినంత
నుండియుమదిచిత్తజుండేయుశరవిరి। యంపఱకుమగుటి యయ్యనతను
తాపనిధాఘసం తప్తుఁడ నాకునీ॥ యధరామృతమొసంగి యలతఁదీర్చ

గీ. కరుణగాపాడుమిదియసూ తరుణినీదు। సౌమనస్యంబునకునెల్ల సార్థకంబు
మగువపదివేలుశుభ లేఖ లగుచునదియ। యెలమితోడుతనీచెంత వెలయుగాత.

కం. అనియొక్కమొగలిరేకునఁ। గొనగోళ్లలిఖించిముడిచి గోపాలుండ
ల్లనఁజిలుకయుఱుతనిడిమద। మెనగూగమీచెలిమికత్తె కిడుమనిపనిచెన్

తే.గీ. అడుగులకెత్తింగి మురవైరి యనుమతిఁ గని
మగువపైఁ గూర్మి మదిలోనఁ మరువకుండని
విన్నపము చేసిరెంతయు వినయమొప్ప
నరిగె రాచిల్క సత్యాగృహంబునకును. ౧౫౦

వ. ఇట్లేగి కృష్ణవిరహచింతాభరతంతన్యమానస్వాంతయగు నక్కాంతారత్నంబుం జేరి. ౧౫౧

సీ. తలయెత్తి చూడవే తరుణిరో నీకార్య । మలమటలేదు పండయ్యె నేఁడు
యదుకులాధీశు నుద్యానవాటికకేగి । కనుగొంటినమ్మ యో కమలనేత్ర
నీచందమెల్ల వర్ణించుదు నీవిూఁది । కూర్మి నుండుట కనుగొంటినమ్మ
యపుడు మదాగమనార్థంబెఱింగించి । సరగునఁ గమ్మరొసంగితమ్మ.

గీ. కృష్ణుఁడదిచూచి మెచ్చెనో కీరవాణి
సుదతి నీ విూఁద చాల నిష్ఠురములాడె
కొమ్మ యెట్లయిన నిన్నుఁ గైకొందుననియె
సమ్మతముగాఁగ దనమాట నమ్మమనియె. ౧౫౨

మ. అనియా మారహయావతంసముప్రియోదంతంబు మారందముల్
జెనుకంజాని సుధాప్రవాహములు రంజిల్లంగ వాక్రుచ్చినన్
విని సత్యాసతి ప్రావృడాగమసమావిర్భూతనీలాంబుద
ధ్వని యాలించిన కేకిచందంబున మోదంబొందెఁ జిత్తంబునన్. ౧౫౩

మ. చెలులా సత్యమనోపికాసమునకున్ జిత్తంబులానందసం
కలనంబొందఁ బరస్పరాస్యములసంఫుల్లాస్యలై చూచుచున్
కలదో యమ్మ మురారికౌఁగిట సుఖాకల్పంబుగా నీవుని
చ్చలు గ్రీడించుట నేఁటరేపటనిఁకన్ సౌఖ్యానుభావంబునన్. ౧౫౪

వ. అని యూరార్చినఁ గొండొకదేటి సత్యావధూటియు నచిరంభావిదేవకీకుమారపరిరంభసుఖారంభసముత్తంభితహృదయాంభోరుహయై వర్తించుచుండె నివ్విధమున. ౧౫౫

కం. తలఁపుల వలపున నొండొరు । గలయంగాఁ గోరికొనుచుఁ గంసారియు న
య్యెలనాగయు ననవధికో । త్కలికల వర్తించిరివ్విధంబున నంతన్. ౧౫౬

వ. అనిచెప్పి ౧౫౭

మ. అలఘుశ్రీమృగనాభిచిత్రనలలామావిద్ధవక్త్రేందుమం
డలనిర్యత్నగళత్సుధారసపరీగాహానుకంపామిళ
ల్లలితాపాంగ విలోకనాభిమతలీలారక్షితాత్మీయయు
జ్జలజాతాశ్రయమంగళాలయసమంచత్సాధులోకప్రియా. ౧౫౮

కం. శేషశిఖరాగ్రమందిర । పోషిత నిజభక్తనికర పుణ్యప్రకరా
దోషచరతమఃఖరకరపరి భూషితనిగమాగ్రశిఖర పురుషాగ్రసరా. ౧౫౯

మాలిని. పరమగుణవిశేషా భక్తసంఘాతపోషా
సురుచిరదరహాసా సూరిచేతోనివాసా
చరణనతసురేశా సర్వపాపప్రణాశా
విరచితసువిలాసా వేంకటాద్రీంద్రవాసా. ౧౬౦

గద్య

ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాప్రసాదితానవద్యకవిత్వ విద్యాభినందన
గిరిజామనోహర చరణారవింద సేవామరందబిందు బృందతుందిల
మానసేందిందిర సాంఖ్యాయనసగోత్రజలధి చంద్రోదయా
యమాన సుబ్బారాయశాస్త్రి పాపయామాత్య సంక్రం
దననందనసహజ పాండిత్యాగేయ కవితారమ
ణీయ సకలసుకవి విధేయ సాంబశివ
నామధేయ ప్రణీతంబగు సాత్రా
జితీ పరిణయంబున
చతుర్థాశ్వాసము.

---

# పంచమాశ్వాసము

కం॥ శ్రీవిలసద్గురుభుజంగ గ్రీవశిఖాభాసమహిత కారుణ్య రసా
ప్లావితదృగంతవీక్షణ భావిత నిజదాసపరమ భద్రవిలాసా॥ 1

వ॥ అవధరింపుము. పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డనంతరకథ యిట్లని
చెప్పె. 2

ఉ॥ ఆవలినాయతాక్షుఁడు మహాత్మకముల్ హితసంపద్రీనక్తి స
త్యానిహితాశయుండగుచు నన్యమెఱుఁగకయుండఁ దన్మనో
మ్లానతఁ గాంచి యాప్తులగు మానిసు లిష్టకథాప్రసంగ సం
ధాన చమత్క్రియాస్థితిఁ బ్రియకృతి ప్రవణత్వమొసంగఁజేసిరల్॥ 3

చ॥ హరియొకనాఁడు హర్మ్యముఖమందు యథోచితకాల్యవర్తనల్
సరగనొనర్చి యగ్రజున సంగతి నోలగముండి సర్వని
ర్జరపరివేష్టితుండయిన శక్రునిబోలుచు నిష్టగోష్ఠి భా
సురగతినుండె యాదవులు నూరెలసమ్మదమొప్పఁ గొల్వఁగన్॥ 4

వ॥ అయ్యవసరంబున సత్రాజిత్తు హితబంధుజనానుమతంబున శ్రీకృష్ణునకు స్య
మంతకమణిసహితంబుగాఁ దన కూతు సత్యభామనిచ్చుటకు నిశ్చయించి యమ్మణి
నువర్ణభాజనంబునందిడికొని బంధుపురస్సరంబుగా మురాంతకుని కొలువుకూటం
బునకుఁ జనుదెంచి సుధర్మామధ్యంతరంబున బూర్వాచలశిఖరాగ్రగతుండగు
మార్తాండుని డంబు విడంబించుచు నత్యున్నతరత్నపీఠంబున నధివసించియున్న య
న్నారాయణుని గన్నులపండువుగాఁగనుగొని రత్నసహితంబుగు బంగరుపళ్ళెరంబు
దత్పురోభాగంబుననునిచి మోడ్పుకేలు ఫాలఫలకంబునఁ గదియించి యిట్లని
వినుతించె.

తరళకంద గర్భిత సీసము॥

జయవికచ, సరసిజాతవిశాలలో । చన శంఖచక్రల సత్క్రాబ్జ
జయనిరత, పరమ సత్క్రమణాభిర । రక్షిత భక్తసంచయ క్షేమదా, యి
జయసుభద, చరణ సారసబంధురా । యితసారమాలిమ ణీట్ప్రసా, శ్యా
జయద్విరద, వరద సాధుజనార్చనీ । యశివంకరాభవనైకపాల

గీ॥ నిరుపమచరితవరగుణాకర శుభకర । దివిజవంద్య కారుణ్యనిధీ మహాత్మ
సురుచిరనవజలధర సుందరగిరిధర । దీనపోషధన్యాత్మహారీ, నమోస్తు 5

చ॥ యదుకులమౌళిమండన మదారినిషూదన చండఖండనా
త్రిదశవరేణ్య వందన వరిష్టపదా నతభక్తచందనా

విదితగుణానుమోదన పవిత్రయశఃప్రకరాభివాదనా
సదమలసత్కృపాసదన సత్యధనావనుదేవనందనా॥
వ॥ అని వినుతించి
ఉ॥ శ్రీవశరణ్య కృష్ణ వసుదేవతనూభవ నీదు ప్రాపునన్
దైవతవారమా నముచి దానవసూదను ప్రాపునన్ బలెన్
భూవినుతప్రభావపరిపూర్ణయశోవిభవాభివృద్ధులన్
పావనసచ్చరిత్ర దనర్చిరి యాదవ యివ్వసుంధరన్
ఉ॥ నీవు నిజంబు మున్నుఁ గరుణించి జగజ్జనరాజిలోన సం
భావనఁ బొందఁజేయఁగను మానకధర్మము నుద్ధరింపఁగా
నీవసుధన్ జనించితివ నీవుఁడవాద్యుఁడవచ్యుతుండవం
చో వినుత ప్రభావభవ దుర్జ్వలలేశము చాటిచెప్పెదన్॥ ౧౦
చ॥ పరమదయాకరుండవయి భక్తుల నేరములెల్ల సైఁచి లో
నగుమతిలేక ప్రోచెదవటంచు బుధుల్ వినుతింతురిట్టినీ
చరిత మెఱుంగ నిక్కమని చాలఁగ నమ్మి మహాపరాధినై
శరణము వేఁడితిన్ గలుష జాలము దీర్చి నన్ను బ్రోవవే॥ ౧౧
తే॥గీ॥ పరమపావననీనామ పఠనుఁ దలఁప
దురితములడంగునిట్టి నీ చరిత మెఱిఁగి
నెఱిఁగి దుష్టుఁడనగుచు నీ యెడఁ దురిత
మకటకలదని పలికిన నదిసహింపు॥ ౧౨
కం॥ విపరీతబుద్ధినగు నా । యపరాధము సైపరాని దైనను కరుణా
విపులత సహించు మ్రొక్కెద । ప్రపన్నజనపారిజాత పరమాత్మహరీ॥ ౩౧
కం॥ చేసితిదుష్కృతమిఁక నే । జేసినయది తలఁపకిఁక విశిష్టదయావి
న్యాసమున నిమ్మణితో । నాసుతఁగాన్కఁగొని మనమునన్ గలఁకవిడన్॥
కం॥ మణిసహితంబుగఁ గన్యా । మణిఁ గరుణం బరిగ్రహించి మధుసూదనన
ధ్ధృణనిఁకవాయపరాధము । గణియింపక ప్రోవవే జగజ్జనవంద్యా॥ ౧౪
వ॥ అని విన్నవించి సభక్తితాత్పర్యంబునఁ బ్రణామపూర్వకంబుగా నమ్మణిసమ
ర్పించిన నాదరించి సత్రాజిత్తుం గరుణాకందళితకటాక్షంబులం దిలకించి కృష్ణుం ౧౫
డిట్లనియె॥
ఉ॥ అతులతపఃప్రసక్తిఁ బ్రియమందె దొసంగెను వీని వయ్యహ
స్పతి వహనీయమిమ్మణి ప్రభావధురీణము నిట్టిరత్నమా
యతబలశత్రుహస్తగతమై యొకచందముగాఁగ భాగ్యసం
గతి మఱలెన్ గ్రహించు మిది కష్టసమార్జిత మన్యయోగ్యమే॥
కం॥ గుణగణమణియగు కన్యామణి మాకుం జాలు నిఁక మణివలదు నీ
వణుమాత్రము ననుమానము గణియింపక కొనుము దీని ఘనగుణధుర్యా॥ ౧౬

క౦॥ అతిమతికలేదు మాయెడ । నెరవుగనీమదిఁదలంప కిఁక గతమునకున్
దరువక యూఱడుమిటు జు ట్టరికముగల్గించితివి దృఢంబుగ మాకున్॥

వ॥ అనిచెప్పి తనపలుకుల కనుమోదంబునొందిన సత్రాజిత్తుంగలపికొని సత్యా కరగ్రహణపరికారంబు గురువృద్ధజనంబులకెఱిఁగించి తదనుమతంబువడసి జ్యోతిర్విద్యావిశారదులగు పురోహితులవలన సుముహూర్త నిశ్చయంబుగావించి యెల్లియ వివాహంబుతడవులేదింక వలయు ప్రయత్నంబుననుండుండని సత్రాజితుని వీడుకొలిపి పురంబునం గల్యాణమహోత్సాహంబుఁ జాటింప నియమించిన॥ ౨౦

సీ॥ కలువడంబులు వన్ని కర్పూరకదళికా స్తంభంబులెల్లెడ నంతరించి
యతిదీప్తధారుచిత్రితనూత్నపటశేత నావళుల్చాల చెల్వమరనిల్పి
మహితగారుత్మత మణులతో జతగూర్చి నవమౌక్తికపు తోరణములుగట్టి
గమగమవలచెడు కమ్మతావులుగుల్కు గస్తురికలయంపి మస్తరించి

గీ॥ విపణివీథులఁ గమనీయ వివిధనూత్న రచనలనలంకరించి చిరత్నరత్న
రుచులు విలసిల్ల మందిర విచయమెల్ల రమణఁగ్రైచేసి రప్పుర రాజమునను॥

శా॥ ఘన్నటంగలయంపి చల్లిమృగనాభంబున్ బిసాళించి హా
రిన్నానావిధరత్న చిత్రరచన గ్గీలించి చిత్రాకు కో
ద్యన్నవ్యధ్వజపాళినిల్పి కడు నూత్నప్రౌఢిమైసేయనో
ప్పె న్నిత్యోత్సవధామమై పురముకీవిన్ గామినీతుల్యమై॥ ౨౨

చ॥ బహువిధతూర్యఘోషములు భద్రగజాంచితబృంహితధ్వనుల్
బహుళమహోత్సవాకలిత పర్యటనేష్టజనానులాపముల్
సహితముమైకదుంబొదవి చందురుపొడ్పునఁబొంగువార్ధినా
విహితమహాప్రమోదరస విశ్రుతమై పురమొప్పెనయ్యెడన్॥ ౨౩

వ॥ ఇవ్విధంబున సకలోత్సవసమేతంబుగా సన్నగంబు విలసిల్లె నంతనానసత్యాకృష్ణులన్యోన్యకరగ్రహణసముత్కంఠాతివేలమానసులై యారేయియొకచందంబునం గడపి రమ్మఱునాడు. ౨౪

క౦॥ హితబంధుసమితిప్రమద । స్థితినయ్యెడ నరుగుదెంచి శ్రీకృష్ణునినూ
ర్జితమధురవాక్యముల సము । చితవైఖరిఁ బెండ్లికొడుకుఁజేసిరి పొసగన్॥

వ॥ అప్పుడు ౨౬

మ॥ అలినీలాలకయొర్తు నవ్యమణిహారాగ్రియరత్నావళుల్
నలువొనిబ్బెపుఁ గబ్బిగుబ్బకవమై నాట్యంబుసల్పంగమే
నులియన్ దివ్యసుగంధతైలమునసెం తో మెచ్చుఁ జేకూర్చఁగాఁ
దలయంటెన్ మురదైత్యభేదికిఁ బ్రబంధప్రహృష్టచిత్తాబ్జయై॥ ౨౭

క౦॥ తోయరుహనేత్రయొక్కతె । స్థాయత్కరకంకణప్రపంచితకలనా
దాయతఝుణంఝుణధ్వను । లేయెడ విలసిల్లనలుగు లిడియెన్హరికిన్॥ ౨౮

క౦॥ సలలితమణికటకఝుళం । ఝుళితధ్వనులుల్లసిల్ల సముచితలీలన్
గలవాణిరొుక్క్క గంధా । మలకంబిడి కురులు చిక్కుమలపెఁ జెలువుగన్॥

క॥ కించిదవలగ్నయొక్కతె । కాంచనచేలునకు నవసుగంధాంబువులన్
జంచన్మణిమయపాత్రల । వంచుచు మజ్జనమొనర్చె వలఁతితనమునన్॥ ౩౦

ఉ॥ చందనగంధి యొక్కరిత చందురువన్నె జిలుంగునల్వచే
తం దడియారఁ గుంతలం దంబము లొత్తుచుఁ జిక్కుదీర్చి మె
చ్చుం దనముప్పతిల్ల సిగ జుట్టి రుటంబగు పూవుటెత్తులన్
జెందొవ కచ్చు గూర్చి ముడిచెన్ వరబర్హకలాపసంతతిన్॥ ౩౧

క॥ ఉచ్చైర్నితంబ యొక్కతె మెచ్చుగులుకు తావిలోలుకు మృగమదమునఁ గాం
బచ్చనికప్రము గూర్చిచి పచ్చటఁ దిలకంబు దిద్దె మురమథనునకున్॥ ౩౨

తే॥గీ॥ ఒకతె నైర్యాన యదుకులైకోద్వహునకు
మానికపుసొమ్ములెల్ల నెమ్మినఁ దొడఁగి
కంగు లెడలించి కలుకుబంగారు దుప్ప
టంబు వలెవాటు సవరించె డంబు మీఱ. ౩౩

ఉ॥ ఉడిగపుటింతు లిట్లు సముచితలీలల నలంకరించ, న
ప్పుడు మురదైత్యభేది యుబ్బ భూతముదంబునఁ గాల్యకృత్యముల్
నడపి హితాప్తబాంధవజనంబులతో నవనీసుపర్వులన్
దడయక పూజచేసి బహుదానములన్ దనిపెన్ బ్రియంబునన్. ౩౪

ఉ॥ భూసురకోటి కర్హమగు భోజనకృత్యము లాచరించి సం
తోసము మీఱ బంధువులతోడఁ జతుర్విధభక్ష్యభోజ్యవి
న్యాసము మీఱ విందు తని వారభుజించి సమంచితోత్సవో
ల్లాసము పల్లవింపఁగ మెలంగె యథోచితవర్తనంబులన్. ౩౫

వ॥ ఇవ్విధంబున నయ్యహశ్శేషంబపనయించుచున్నంత ౩౬

క॥ మురవైరి నేయు సత్యా । కరగ్రహణవైభవంబు గనవరుణునకున్
సురపతి రానంపినఁ బం । గరుకమ్మ యనంగఁ దరణి కడలిం గ్రుంకెన్. ౩౭

క॥ జగదీశ్వరు పెండిలికై । జగమెల్ల వెలుంగ నీలి చాందిని యిడి సాం
పుగ ముత్తియముఁ గూర్చిన । వగిదిని తారకలు మింటఁ బ్రబలం బయ్యెన్. ౩౮

మ॥ హరియింద్రావరజుండు పెండ్లికొమరుం డైనంత నింద్రాణి బం
ధురకౌతూహలదత్తచిత్తయగుచున్ దోడ్తోన భాద్రంబుగా
నిరవౌ పూర్వదిశాసరోజముఖిచే నెత్తించు కర్పూరభా
స్వరనీరాజనదీపభాజనమనన్ జంద్రుండు దోఁచెన్ దివిన్ ౩౯

వ॥ అయ్యవసరంబున. ౪౦

తరళ॥ కదియఁగా నిదె వచ్చె లగ్నము గ్రక్కునన్ వెడలుండటం
చుదితసంభ్రములై పురోహితు లొక్కటన్ ద్వరపెట్టఁగా
యదుకులోద్వహుఁ డాప్తబంధుసమన్వితుండగుచున్ బ్రియా
స్పదమతిన్ వెడలెన్ సమంచితవైభవోజ్జ్వలవైఖరిన్ ౪౧

సీ॥ తతగండమండల దానాంబుపూరికి । దరియుతు మ్మెదలుగ్రీ తములువాఁడ
కటకబంగరుపోఁత చిఱుగంటలటుతద్ది। త్తరపుఁ బ్రోఁతలఁ జేఁటి దాఁటుపిలువ
తతవజ్రరుచిగర్భ దంతకాండద్యుతుల్ । నిద్దంపుఁ బండువెన్నెలలు గాయ
పసిఁడిసొమ్ములతోడి పనిమించు నెమ్మేను సతటిద్ఘనాఘనచ్ఛవి ఘటింప॥
గీ॥ చటులనవరత్నఖచిత కాంచనవిశిష్ట రమ్యపల్యంకికాయుక్తి రహిఁ వహించు
నట్టి సమదమదావళ మధికమానము తో నధిష్ఠించి వెడలె యదుప్రభుండు॥
చ॥ ఇరుగడ రామసాత్యకులు లక్ష్మపరిష్కరణాభిరామ బం
ధురమదసింధురంబులఁ బ్రియోప్రమెలర్పఁగ నెక్కి వెంబడిన్
బరమవిభూషణాంబర విభాసితులై యదువృష్టివీరు లె
ల్లరు గొలువన్ మహోత్సవవిలాసమునన్ జనుదెంచి రయ్యెడన్॥ ౪౩
మ॥ అనుమోదంబున నుగ్రసేన వసుదేవాక్రూరహార్దిక్య మా
న్యనికాయంబుచితపరిష్కారమునను ద్యద్యానసంరూఢులై
తనవెంటన్ జనుదేరఁ దూర్యములు మంథానాదినిర్మథ్య మా
నవదద్వార్ధిరవంబు చందమిరవొందన్ వచ్చె గృష్ణుండటన్. ౪౪

వ॥ ఇవ్విధంబున వాసుదేవుండు పెండ్లిసింగారంబై వెడలి యుగ్రసేనపురస్సరులై వసుదేవాక్రూరాది గురువృద్ధమాన్య జనంబు లుచితవాహనారూఢులై యగ్రభాగంబుననడువ నిరుగడల రామసాత్యకులు గంధసింధురస్కంధాధిరూఢులై తోడ నడువ, నానావిధరత్నఖచిత కాంచనభూషణమాలికా రోచిష్కలాపంబు నిర్వక్రిశక్రచాపతటిద్వల్లీ వితానవిలాసంబులావిష్కరింపఁ గాంచనఘంటికా గణ ఘణఘణాత్కార గర్జారవంబు వెలయ సజలకలాహకంబు గ్రీకిసేయు పట్టపేనుంగుపై బెల్లయిన మగమానికంపుజిగి వెల్లువదిగ్వ్యాటంకంబులఁ జెన్నాఱు వెన్నెలలు పరిష్కరించు రమ్యపల్యంకికాతలంబున నంజనాచలశిఖరాగ్ర సంచరిష్ణు బాలార్కమండలంబు డంబు విడంబించు మాణిక్యమకుటంబు శిరంబునఁ గరంబు రాణింపఁ గౌస్తుభహారంబు సకుందోడుగా శ్రీవత్స వనమాలికలు పేరురంబున బ్రకాశింపఁ బీతకౌశేయయుగళ కాంతి సంతతులు దిక్కులబంగారునీరువోయ సకలజన నయనోత్సవస్ఫూర్తి కరంబగుమూర్తి విశేషంబునఁ గీర్తనీయచరిత్రుండగు నయ్యుత్తరకుమారుండు సుఖాసీనుండయి వందిమాగధ జనముహుర్ముహుః పరిపాఠ్యమాన నిజదశావతారచర్యాసందర్భిత బిరుదాంకవాక్యములును, సొంపిదల్లక సాహోనినాదంబులును బహువిధ మంగళతూర్యత్రియ ఘుమంఘుమారావంబులును నొక్క ప్రోఁతయై మంథాయమానమందరధరాధర నిర్మథ్యమానక్షీరార్ణవోద్ధీర్ణ సంరావంబు ననుకరింపఁ బొంగారినపాలకడలి పెందెఱలయందు దోఁతెంచు నచ్చరమచ్చెకంటుల చిత్తంబు బుణికి పుచ్చుకొనుచు నగ్రభాగంబున దండలాసకహల్లీసక ప్రముఖనృత్య కలాకలాపంబులఁ బచరించువారాంగనాసముదయంబలంకరింపఁ దక్షిణాదుగా నాటపైన వాసుకిమహానాగసార్వభౌముని ముఖంబులనుండి ఫూత్కారయుక్తంబులై వెడలు విషాగ్నుల దండంబున నుచ్చైస్సీత్కారంబులతోఁ జెచ్చెరిగి చిమ్ముచున్నను తారాజూష్ప

అను, నందంబు గ్రందుగా విలసిల్ల కలశార్ణవతరంగజనిష్యమాణంబై తరంగభంగిగా వశంబున ననేకరూపంబులఁ దోఁచు పూర్ణేందుమండలంబులంబోలి చంద్రజ్యోతులు లెక్కకు మిక్కుటంబులై ప్రకాశింప మంథానగిరివరపరిభ్రమణ వేగంబున నుద్గతంబులై తురియు పయశ్శీకరకదంబంబులంబోలి పుణ్యాంగనాకరకమల వికీర్ణ ముక్తాక్షతప్రకాండంబు విలాసంబు చూప సకలజనంబులకుఁ గన్నులపండువై డెందంబుల గ్రందుకొను నమందానందంబు సుధారసప్రసారంబుగాఁ బాలసంద్రంబు వెడలివచ్చిన చందంబున నెడనెడ వివిధమంగళపదార్థంబు లుడిగంబులిడుచు పౌరజానపదసంఘంబు దర్శనార్థులై యనుగమింప, దివ్యసంయమిప్రకరంబులు సత్యంబులగు నిగమవాక్యంబులచే సాక్ష్యదింప, మానికంపుటారతి పళ్లెరంబులం దాల్చి పుణ్యాంగనానికరంబు గౌరీకల్యాణంబులు పాడ రాధారుక్మిణీ ప్రముఖయోషిద్గణంబులు దేవకీదేవిం బొదలఁగొని సముచితచతురంతయానంబులన్ జనుదేర, వందిమాగధ కవిగాయక నర్తకపరిహాసిక వాంశిక వైణవిక మార్దంగిక ప్రముఖులగు వినియోగంబుల వార లుచితగతిసేవింప నభిరామసంభ్రమంబున మందమంద గమనంబున జనుదెంచు పెండ్లివారిని నిజబంధుహితపురోహితసామంతపురస్సరంబుగా సకలపరివారంబుతోడ నెదుర్కొని సత్రాజిత్తు సగౌరవంబుగఁ దోడ్కొని చని యభిమతాలంకార పరిష్కృతంబగు నొకమహాస్థానమందిరంబున విడియించినంతఁ దత్సమయంబున. ౪౫

తే.గీ. తోయజాక్షులు సత్యావధూటి కపుడు
పెండ్లిసింగార మొనరింపఁ బ్రేమతోడ
మంచిలగ్నంబునఁ గుప్పక మించి పేర
టాంద్రు దీవింపఁ జెలికత్తె లంతఁగదిసి. ౪౬

కం. పరిమళతైలంబున నంటి । కురులంటుచుఁ జిక్కుదీర్చి గోపజవాదిన్
గురుకొనుగంధపుటటకలి । తరుణికిఁ దలసంటి రపుడు తామరసాక్షుల్ ౪౭

తే.గీ. లేతపలపురు లింపు పన్నీటజలక
మార్చి చందురుకావి మేల్మడుగుచీర
గట్టి తడియొత్తి కురులుచిక్కులు విదర్చి
యగురుసాంబ్రాణిధూపంబు లాతులించి

కం. గుబులుకొనుకస్తురినియ । రవమెలుఁగిడి దువ్వి కురులొరపు కొల్లంటన్
సవరించి మేలిసంపఁగి । పువుబెత్తులు జుట్టి రపుడు పూర్ణేందుముఖుల్

తే.గీ. కమ్మకస్తురిశోఁదిల కమ్మదిద్ది
నవ్యఘనసారమిళిత చందనము చాల
దగుకు చెక్కులఁ గులుకు గుబ్బలను బూసి
లలితమణిభూషణంబు లలంకరించి

తే.గీ. సరిగబురుసారుటంపుని చ్చలపురంగు
వలెపెసావడ ధరియించె చెలువుగులుకు

వైశికీశైక బటువుగు బ్బలఁదోడంగి
యింపుమీరంగ గైసేసి రింతులెల్ల. ౫౧

తే.గీ. మనసు మెచ్చంగఁ జెలువ లిమ్మాడ్కి వివిధ
రచనల నలంకరించగా రాజవదన
బాలవోప్పారె మదనుండు జగము గెలువ
సానబట్టిన మోహనాస్త్రంబనంగ. ౫౨

వ. ఇవ్విధంబున సత్యభామం బెండ్లికూతుం జేసి రనంతరంబున ౫౩

ఉ. కదియఁగ వచ్చు లగ్నమిదె గ్రక్కున రెండనుచున్ బురోహితుల్
వదలక దీవనించి హిత బంధుపురస్సరయుక్తిగాఁ గస
మ్మదమిర వొందఁగా వెడలి మంగళతూర్యనినాదమొప్పఁగా
యదువిభుఁ డేగుదెంచె మ ప్రియంకరలీల వివాహవేదికిన్. ౫౪

సీ. పగడంపు నిలువుకంబంబులపై వెల్వు । రాచరావట్టియల్ రహిఁ బహింప
మగమానికముల నిమ్మగు కవ్వుపలకలు । గోమేధికపు చూఱు కొణిగెలమర
కట్టాణిముత్యాలఁ గట్టిన మాలరుల్ । పద్మరాగపు వింత బవిరెలొప్ప
గరుడపచ్చల మొలక తోరణంబులు । నవమౌక్తికపు వితానములు వెలుఁగ

గీ. చలువ వెలతాల జిగిమీరు జగతులొప్ప
నొప్పు పెల్లను కుప్పగా నొప్పియున్న
పెండ్లిచవికెకుఁ జనుదెంచి ప్రియము మెలర
చిత్రమణిపీఠమున సమాసీనుఁ డయ్యె. ౫౫

శా. భూదేవోత్తములెల్ల భద్రకలనన్ బుణ్యాహపూర్వంబుగా
నాదిత్యార్చిత నేకదంతు నుచితార్ఘ్యార్చాన్వితుం జేసి స
మ్మోదం బొప్పగ నాందినిర్జరతతిన్ బూజించి సంకల్పమున్
వేదోక్తస్థితి నాచరించిరి ముదావిర్భావచేతస్కులై. ౫౬

వ. అప్పుడు, ౫౭

శా. లోకజ్ఞరత్నపుటారతుల్ గుబురుకొంచున్ బేరటాండ్రెల్ల గౌ
రీకల్యాణము పాడుచున్ గదసి రాఁ బ్రేమిన్ బ్రియాళీజనుల్
మూకల్ గట్టుచు సూనమాలెలం బొదివి యింపున్ బుజ్జవం బొప్పఁగా
నాకంజాననఁ దోడి తెచ్చిరి వివాహప్రోల్లసద్వేదికిన్. ౫౮

కం. నునుసిగ్గు పొంతెరలు ద్రె । స్సనఁ దెలువాయెత్తంగ నపుడు వనబోఁడులు సొం
పునఁ దెలియెత్తిరి వనజా । ననఁ బెండిలిపీటఁ జేర్చి నలువమరంగన్. ౫౯

కం. భేరీధక్కాశంఖకు । లారవములు మార్యములు శుభాస్పదలీలన్
బోరుకొనంగ కళ్యాణస । మారంభము వెలయ నవ్వు డభిమతభంగిన్. ౬౦

శా. సత్రాజిత్తు మహానురాగ్రతమహా సంకల్పపూర్వంబుగాఁ
బాత్రాగ్రేసరుఁడైన మాధవుని సత్పాదారవిందంబులన్

ఱ్రత్నాలంకృతరత్నభాజనమునన్ జెల్వొప్పఁగానుల్లస
త్స్వచ్ఛానర్జితవారిధారగడిగెన్ బ్రస్ఫీతమోదంబునన్. ౬౧
మ. బలిబంధించిననాడు మిన్నొలుమనీ పాదంబుభక్తిం గమం
డలు నీరంబులు సల్లినిర్జరులతో డన్ బ్రహ్మ పూజించెనా
దళితాంభోజ సదృశమాపదము సత్రాజిత్తుచే నొత్తిత్రా
నెలమిన్ బూజలొనర్చె వానిసుకృతం బేమందు సర్వేశ్వరా. ౬౨
సీ. ఆదిమహామునీంద్రులు సమంచితభక్తిరసామృతస్ఫూర్తి
వేదశిరోగ్రవీధుల గవేషణజేసియుఁ గానలేని శ్రీ
పాదసరోరుహద్వయము బంగరుపళ్ళెరమందునిల్పి స
మ్మోదముతో మహార్హమగు పూజలొనర్చెఁ గృతార్థజన్ముఁడై. ౬౩
శా. కన్యాదాతప్రతిగ్రహీతయొడ సాక్షాద్విష్ణుభావంబు సా
మాన్యప్రక్రియ నుంచఁజెల్లునఁట యీ మర్యాద సత్యంబుగా
వివ్యక్తంబయి యివిధ్యంబున మహావిష్ణుండె చేకూరఁగా
ధన్యత్వంబఖిలంబునిల్చెగద సత్రాజిత్తునందయ్యెడన్. ౬౪
సీ. అలఘుమణిప్రభారుచిరహాటకభూషణపంక్తులన్ సము
జ్జ్వలకనకాంబరంబులఁ బ్రశస్తగతిన్ దగనిచ్చి భక్తిజో
త్తిల బహుమానపూర్వముగ దివ్యసుగంధసుమాదిపూరజలన్
నలువుదలిర్పఁ గృష్ణునకొనర్చె నతండు ప్రహృష్టచిత్తుఁడై. ౬౫
కం. ఉరితిసూక్తవిధంబున నీగతిఁ గన్యాదాతవరుని ఘనతరముగ స
త్కృతుఁజేసి మహాజన సమ్మతమున సంకల్పపూర్వ మహితస్థితిలోన్ ౬౬
శా. కన్యాం రూపసమంచితాం మణిగణా కల్పాన్వితాంసద్గుణై
ర్ధన్యాంతే హరయే మహాత్మవిభవే దాస్యామిసంతర్పితం
మన్యేనేన పరాత్పరమ్మనుచుఁ బ్రేమన్ గృష్ణుచేఁజేర్చి తా
ధన్యత్వంబున ధారవోసెఁగద సత్రాజిత్తు సత్యాసతిన్. ౬౭
ఆ. వె. కలిమిమెలునిచ్చి కలశాబ్ధియానాఁడు మిన్నుముట్టినట్లు వెన్నునకును
గన్ననిచ్చి పెంపుగాంచి సత్రాజిత్తు ధన్యతముఁడనంచుఁ దలఁచి పొంగె.
కం. సిరిఁజెట్టవట్టి మురిసెడు కరమున నాసత్యభామ కమలారుణభా
సురపాణి పల్లవముగొని చరితార్థతఁగాంచె శౌరి సంతోషమునన్. ౬౯
వ. ఇట్లు కృష్ణుండు సత్యాపాణిగ్రహణంబు గావించి తదనంతరంబున. ౭౦
కం॥ జిలకఱజెల్లముఁగూరిచి । రోలవాగళిరంబునందునిడె మాధవుఁడా
విలుగూర్పు నారియానల । యళికులమున కెలమినొసఁగు నాపెండ్లిఁ గన్ ౭౧
తే॥గీ॥ ప్రణయశోభావనయనసం ప్రార్థనార్థ
భావిపాదసంవాహశోభ ప్రకృతియున
పడఁతిపాదాంబుజముకేలఁ బట్టిసన్న
కల్లుమెట్టించెశౌరియు కాంతమెరయ॥ ౭౨

ఉ. కట్టెను మంగళసూత్రమాయదుకులైకశిఖామణుండు పెన్
పట్టున సత్యగళాగ్రసీమ(బురణింపగ బాంచజన్యంబులో
నట్టైగల్పితజయంబుగ వణింపగ గండపెండేరముగ్
దిట్టల మెచ్చగఁ గట్టెనో యన శుభస్థేమాభిరాముండుగన్॥ ౩౪

తే॥గీ॥ భూసురుల వేదమంత్రముల్ పుణ్యసతుల
గౌరికళ్యాణములు సుమాగధులవిజయ
శబ్దములు భద్రతూర్యత్రయ శస్తరవము
లలమికొని బోరుకొనియెనయ్యవసరమున॥ -౩౫

వ॥ అప్పుడు.

కం॥ తెలియుత్తిరిందువదనలు । తెలియొత్తెవధూవరులకు దృక్కౌతుకముల్
దెలియొత్తె సిగ్గుమగువకుఁ । దెలియొత్తె ముకుందుజయుగళిధ్వజమునకున్॥

ఉ॥ ఘనకాంచీనిగళంబులందవిలి జోకగ నాభిగా సారమ
జ్జనముల్ జేసి వళీతరంగములకు జక్కగ నాటుచున్ గీవర
స్తనదుర్గంబులఁ జిక్కి శైత్యోపలిభాస్వద్వక్త్రలావణ్యద
ర్పణలాభంబున ధన్యతం గనియెఁ గృష్ణప్రేక్షణవ్రాతముల్॥ ౩౭

కం॥ నందనుకదేహరుచిసం । స్పందితయమునాప్రవాహ సరణినిగడునో
ప్పం దెలివజ్రపు వాపులు । పెందలలై బెళకుసుగులికచేడిసలగుచున్॥ ౩౮

ఉ. పుడుక మెలర్పుముత్తెములు కోమలిదోసిటనించి శ్రీహరి
పద్మ్యాతయ ఘనింతి కేలుతమ కేలఁ బెనంగొనిపోయఁగా దర
స్మితరుచికందళుల్ జెరయ శ్రీహరియాదలనించెనే సబ్రా
లతివలు కౌతుకావృతమనోంబుజలై తనుమేలు మేలనన్॥ ౩౯

ఉ॥ అందపుసిగ్గు మొల్కలిడ నచ్యుతు పైతలఁబ్రాలువోయఁబూ
ర్ణేందునిభాస్యకేలుజడు లించినవ్రేళులనంటిముత్తెముల్
పొందుగ లేజివుళ్ళకడఁ బొల్పెసలారెను కోరకంబుల
ట్లం దులకించె హర్షరస లాభముచూపరులెల్ల గాంచగన్. ౪౦

మ॥ అలినీలాలకపై ముదంబువజ్రమౌక్తికావత్యముల్ ముత్తెపుం
దలఁబ్రాల్పించెఁ దదీయకౌశికమిళం దర్శేణికిన్ విందుగా
నలవొప్పారగఁ గుందకుట్మలచయం బర్పించెనో నాఁగఁ బ్రే
వలఁగౌతూహలదత్తచిత్తలగుచున్ బద్మాస్యలందీయఁగన్. ౪౧

చ॥ శిరమునునుండి కేశరుచి చేబలభిన్మణికందళంబులై
మరకతశోభనొందిగరి మన్దను కాంతిసమంచితంబులై
సురుచిర కాంచనాంశుకము సొంపునఁ గాంచకుట్మలంబులై
తరుణియొసంగుప్రాలు మురదానవభేదికి సంగెనత్తరిన్, ౪౨

ఉ|| కాళియనాగభేదికర కంజవిముక్తములైనముత్తెముల్
ప్రాలునవారుణాంబురుహ పాణికచంబుననుండి రాలుచున్
నీలఘనాఘనాంతర వినిర్గతసత్కరకాప్రతానవా
చాలతఁజూపెనుజ్జ్వలరసప్రసరంబెసఁగన్ సమున్నతిన్ ౮౩
ఉ|| అంకురితస్మితద్యుతి సమంచితకౌతుకలోచనాంతరా
గాంకురగర్భవీక్షణ ము ఖాతిశయంబునఁగంసవైరియున్
బంకజనేత్రయుండొరుల పైపసనించెడుసేసఁబ్రాలుని
శ్శంకశుభప్రతానములు జాలజగంబులకిచ్చునెప్పుడున్ ౮౪
కం|| పౌరోహితులప్పుడుశుభ ! పారీణతసతికిఁబతికి బ్రహ్మగ్రంథుల్
వేరచియించిరిశ్రుతిమం । త్రారూఢిగవీటికాధ లాదియుతముగన్ । ౮౫
కం|| సతియున్ బతియునుసమలం । కృతవహ్నిముఖంబునందు వ్రేల్చిరిలాజా
హుతములుపురోహితోదిత । వితతశ్రుతిమంత్రములను వేడుకమీఱన్. ౮౬
కం|| అతులితసౌమాంగల్య । ప్రతిష్ఠితాత్మీయమహిమ భాసిల్లునరుం
ధతికిన్ మ్రొక్కించిరిస । మ్మతినింతులుగూడిశుభ సమగ్రతవెలయన్ ౮౭
వ|| ఇవ్విధంబున వేడుకమీఱ వివాహంబుగావించి నాకబలినిర్వర్తించి తదనం
తరంబున. ౮౮

సీ|| నిగనిగల్ దళుకొత్తు నగరాలగోడలు వలుదనీలంపు కవాటములును
పగడంపుబోదెకంబములు నిద్దపుఁదమ్మి రతనంపుఁజనులద్వారంపుగడప
లసిల్లుగరుడపచ్చలతోరణంబులు వైడూర్యమణుల గవాక్షములును
కట్టాణిముత్యాలఁ గాలిలు సోరణగండ్లు కరమొప్పు పుష్యరాగంపుగోడ
గీ|| లిందుమణి కందళంబుల నెసఁగుజగతు
లెసఁగు గోమేధికపుమెట్టు లింపుగులుకు
వందములకుప్పయైమించు నట్టి యొక్క
భాసురంబైన కేళికా భవనమునను|| ౮౯

సీ|| కనకకుంభాగ్రి సంఘటితమాణిక్యముల్ కలితదీపాంకుర కలనఁజూపు
గోడపరిక్కలఁ గీలు కొలిపినయపరంజి కీలుబొమ్మలు సురటీలువీవ
సరవితోరత్న పంజర కీరశారికా తతులు శృంగారకథలు వచింప
తోడరికాలాగురు ధూపధూమంబులు భవ్యనూతనసౌరభములుచుప్ప
గీ|| నభినవానంగ శాస్త్రరహస్యములను
దెలుపు చిత్తరువులుసొంపు గులుకుచుండ
బహుళతరభోగ్యవస్తు సంభరితమగుచు
నింపుసొంపుగులుకు పడకింటిలోన|| ౯౦

చ|| పగడపుకోళ్లు నీలముల పట్టెలు ముత్తెపుజాలవల్లికల్
నగరతనంపుకీల్బొమలు మవ్వపుబందిరి హంసతూలికల్

సొగసగు జాళువావలెపు చొక్కపుదిండ్లు తలాడలుఁ బయిఁ
గ్రుగ్గు గుగ్గులావులొలుక విరి పూవుల సెజ్జఘటించిరగ్గ్యాడఁ. ౯౧

మ. యదుచూడామణి కేళికాభవన రమ్యస్ఫూర్తికిన్ మెచ్చుచున్
మృదుతల్పంబుపయిన్ వసింపఁ జెలియల్ నేర్పొప్పఁగా నవ్వడ
మ్మదిరాక్షీమణిఁదోడితెచ్చి రవల న్మందాక్షయై పల్మరున్
గదలన్ బోక పెనంగుచున్ బిగ్గిదులవే డ్కన్ బుజ్జగంబాడుచున్. ౯౨

వ. అట్లుతోడితెచ్చి.

ఉ. ఓ చెలివమ్మ నెలంత సిగ్గఱితనం బైతోఁచె నీచందముల్
మేలౌగా మునునీదు పెన్వలపు బూమెల్ నూడమే కౌఁగిటన్
గీలింపన్ దటిదైన నేకరణిఁగల్గెన్ వింత సిగ్గింకిటన్
జాలింపంగదవమ్మ నాథుఁడెదనే చందంబు గాఁజూచునో. ౯౪

కం. చెలులిట్లు పొదిలికొనిగా । దిలిపలుకుల నింతఁదోడి తెచ్చిరి కేళీ
నిలయమునకు వలగాయని । యలపట్టుపుదంతి తెచ్చి నట్టుల ప్రీతిన్. ౯౫

కం. తోడితెచ్చి వింత సిగ్గున । జడిమ విడిగొమను కయ్యఁ జేరిచి నెయ్యం
బడరఁగ యదువల్లభునకు । బడఁతుక చేఁగూర్చి యిట్లు పలికిరి కూర్మిన్. ౯౬

కం. తలపులఁ గులికిరి యిరువురు । పలుమఱుతతితీపుగొలుపు బావము లాదవన్
తలపులు ఫలించె కోమలి । కులుకుం జనుదోయి కానుకఁ గొనుమిదె ప్రీతిన్. ౯౭

వ. అని యొప్పగించి

ఉ. చిలుకఁ బండొసంగకయె చెచ్చెఱవచ్చితినంచు నొర్తు పూ
వులసరులిందుఁ దేమఱచి పోయితినంచు నొకర్తు దేవికిన్
గలపము గూర్పలేదని యొకర్తు నెపంబులు సెప్పి యంతనా
పొలఁతుకలందరున్ వెడలి పోయిరొకర్తుక వెంటనోర్తుగాన్. ౯౯

కం. చెలికత్తెలిట్లు వెడలినఁ । జెలికత్తియ వోలెనింతిఁ జేరి నత్రపయున్
దొలఁగించనఁ జూచె వలచిన । చెలువునిఁ గనితన్ను సరకు చేయదొ యనుచున్.

ఉ. అలరుకరంబు వట్టి ప్రియుఁ డయ్యెడ సెజ్జకుఁ జేరఁదీయఁగా
నలువలరారు సిగ్గునఁ బెనంగఁ దలోదరి మేను స్వేదపి
చ్ఛిలమయి కంటకోద్గమముఁ జెందె రసార్ద్రిమొనర్చి భావకం
దళులాదవంగఁ గర్షణము నర్చెనా తావెడవింటి కాఁపనన్. ౧౦౧

కం. చెలువుని కరంబు సోఁకినఁ । బొలతుక మైదీఁగ వడఁకు పొలుపమరముం
డలరి తలిరాకు కైదువు । జళిపించెను భావివిజయ సంగతినఁగన్. ౧౦౨

సీ. పరులచిక్కుడలించి నవరించు పోలికఁ । గులుకుగుబ్బలఁ గొన గోరులుంచి
కలపంపు తావి పొంక మెలుంగు నేర్పున । నిద్దంపు చెక్కిళ్లు ముద్దులాడి
తమలంపు రుచుల బిత్తరము మెచ్చువితాన । మోవిపై తళుకుపల్మొనలు నిల్పి
హారాగ్రమణియుతా గరతమ్యమెఱుంగు । బాగున బిగ్గనఁ గౌఁగలించి

గీ॥ వలుదమొలనూలు సవరించు వలను దోఁపఁ
దడవి పేరుపు గాఁపోఁక ముడి సడల్చి
యుల్లమునఁ గోర్కు లిగురొత్త గొల్లలాడ
బల్లవాధరరతుల గోపాలుఁ డపుడు ౧౦౩

సీ॥ అసకృత్కుచాశ్లేష తాపనోదనసంప్ర । సారితపాణిపంకేరుహంబు
ముహురధరాస్వాద మోహనిరోధితి । ర్యక్ప్రసారితవదనాంబుజంబు
పరితఃకపోలచుంబనవారకాంసనం । ధానితస్తబ్ధగండస్థలంబు
బహుళనఖక్షత వ్యాపారవసహిష్ణు ॥ కారణజనిత సీత్కారరవము

గీ॥ గాఢపరిరంభపరవశాంగంబు గళిత । నీవికాస్పతస్విన్న పాణికము నగుచు
ప్రథసౌఖ్యావిదిత పరప్రక్రమంబు । శౌరిఁ గఱఁగించె నానవోఢాతిశయము

చ॥ అభిమతకేళిఁ దృప్తులయి యంగనయుం బతియుం రతిశ్రమ
క్షుభితశరీరులై నిదురఁ జొక్కిన వేళఁ బ్రఫుల్లపద్మసౌ
రభవహమందమంద విచరత్పవనార్భకసంప్రయుక్తిఁ స్వే
దభరము వాపి యాడిగము తత్పరతం ఘటియించె వేకువన్ ౧౦౪

వ॥ అప్పుడు. ౧౦౫

సీ॥ మనసొప్పకల్లన మఱలి పైఁబిగ్గనఁ । గౌఁగలించిన యట్టి కరము దీసి
పిఱుఁదుపై జాఱి తబ్బిబ్బైన పావడ । సవరించి యొకకేలఁ జక్కఁ జుట్టి
వీడివిన్ననవాడు వేనలి డాకేల । సొగసుగాఁ బ్రేల్ముడి ముట్టి చుట్టి
నెలవంక నొక్కులఁ గులుకు లేగుబ్బలఁ । జెదరిన యలఁతికం జెలఁగించి

గీ॥ తమ్మరసమంటు జెక్కుటద్దములు సురత
జాగరారుణలోచనాంచలము లమర
మెల్లగా బాన్పుడిగి చను మెలఁతఁ జెలియ
లాంచహరిమదిరాగాఢి ముంచిరొత్తె॥ ౧౦౬

సీ॥ నిండు కౌఁగిటఁ జిక్కి నెలఁతగుబ్బలకుంకు । మాంకమూరంబున నందగించ
కలికి వాల్గన్నుల కాటుకరేకలు । చెక్కుటద్దంబులఁ జెలువుసూప
సురతసమ్మర్దవిస్ఫురణంబు చేఁజిక్కు । వడిన హారము లెద వన్నెఁ జూప
సతియా హారాగ్రమౌక్తికములొత్తిన చిన్నె లుదుటు సందిళ్లపై నెఱపుఁ జూప

గీ॥ నవ్యకాంతారతాంతచిహ్నములు స్వీయ
వైభవంబున కొకవింత వన్నె దేఱ
ముదితమానసుఁ డగుచు నయ్యదువిభుండు
మురువు మీఱంగఁ గేళిమందిరము వెడలె. ౧౦౭

ఉ॥ శ్రీతిలతికాళికందమున రోజిని పుణ్యఫలంబు సిప్పప
ప్రతతికిఁ గర్మసాక్షి గ్రహరాజికి నేలిక యాద్యవైదిక
త్రితయము నేకరూపము ప్రదీప్తమహోనిధి యంధకారసం
తతికిని వేరుపుర్వు ఖరధాముఁడు ప్రాగ్గిరిఁ దోఁచె నయ్యెడన్॥ ౧౦౮

వ॥ అంత గోపాలశేఖరుండు తత్కాలోచితకార్యక్రియాకలాపంబు నిర్వర్తించి యదువృష్ణిభోజాంధక పరివృతుండై సుధర్మాభ్యంతరంబున సురగణంబులతోడి బిడౌజుండునుంబోలెఁ గొలువుండి యుచితవినోదంబులం బ్రొద్దుపుచ్చుచుండె తదనంతరంబున.

సీ॥ లలితవసంతశ్రీ లాక్రాంతసలతాంత । మానితనూతనోద్యానములను
మంజులశశికాంత మణిసానుతటకాంత । సమధిక కేళికా శైలములను
కమలకషాయగంధమరుత్కిశోరసం । చారకేళిసరస్సీరములను
భ్రమదభ్రసమద భ్రమరవిభ్రమరవ । గుంజన్నవసుమనః కుంజములను
గీ॥ హరినవరత్నమయనర్మహర్మ్యములను । చారుసౌవర్ణమయదివ్యసౌధములను
నభిమతవిహారములఁజొక్కిరనవరతము । సత్యభామయుఁగృష్ణుఁడుసంతసమున
మ॥ జలజాతాక్షుఁడుసత్యభామయును యథేష్టక్రీడలంగూర్మిని
చ్చలుసంతుష్టులుగామెలంగిరి గణింపన్ లేదసంతుష్టియెం
దులనొక్కప్పుడుకల్గినన్ గలుగుఁబో నూత్నామృతస్యందిశీ
తలబింబాధరమాధురీభరసమాస్వాదప్రమోదంబునన్. ౧౧౩

వ॥ ఇట్లు సత్యాకరగ్రహణ ప్రమోదంబు నిర్వర్తించి తదీయబహువిధక్రీడా విశేషంబులంజొక్కి యక్కపట గోపాలశేఖరుండు సమంచిత సుఖానుభవ పేశలమనస్సరోరుహుండై వర్తించుచు తదనంతరంబున కాళిందియు, నాగ్నజిత్తి, భద్ర, సుదంత, లక్షణయను నేవురు బరిణయంబై యష్టమహిషీ సహితుండై విలసిల్లె మఱియును.

శా॥ ఆసత్యారమణీకులైకమణియం దత్యంతసమ్మోదకే
ళీసంతృప్తినెలర్చుచున్ నిజమహాలీలానురూపాకృతి
శ్రీసంపన్నులఁబుత్రులన్ బడసినం బ్రీతిన్ యథేచ్ఛావిహా
రాసక్తిన్ విలసిల్లెలోకము మహాయానందమగ్నంబుగాన్ ౧౧౪

సీ॥ అనుకూలనాయకుం డయిసత్యభామను । తిన్ననైననెడబాసి చనకకన్న
సన్నలోమెలఁగుచు సతతానురాగకం । దళితాంతరంగుఁడై యలరువిల్తుఁ
జరితార్థుఁజేయుచు సంప్రీతిఁదత్ప్రియ । కామునసమర్త్యలోకమునకేగి
యమరగణంబుతో నమరేంద్రువిముఖిని । గావించిభూరివిక్రమమునెఱపి
గీ॥ నందనోద్యానమునమెప్పు నందుఁబారి । జాతమవనికిఁగొనితెచ్చి సత్యభామ
పెరటచెట్టుగనాటించి పేర్మిమించి । కృష్ణుఁడలరారెవిభవగోచిష్ణుఁడగుచు.

ఆ॥ వె॥ భాగ్యమన్నసత్యభామదే కాక నెం । దైనఁగలదెయింద్రు నను(?)గుచెలిక
చములకయిన పారిజాతముల్ గయిచేసి । ప్రియుఁడుగారవింపఁ బెంపునందె॥

వ॥ అని సాత్రాజితీపరిణయవృత్తాంతంబు సుధారసంబులు చిలుకసూతుఁడు చెప్పిన శ్రవణపుటంబులం గ్రోలి పరీక్షిన్నరేంద్రుండు పరమానందకందళితాంతరంగుండయ్యె. ౧౧౫

క॥ ఈసాత్రాజితిపరిణయ । భాసురచరితంబు వినినఁ బఠియించినను
ధ్యానమునఁ జేసినను ధర్మని । వాసుఁడు దయసేయు నఖిలవాంఛితసిద్ధుల్॥ ౧౧౯

## కృతిసమర్పణము.

సీ॥ మహిమాతిశయవైష్ణవమతవేళ నిరువది । యెనిమిదియగు యుగమునను గలియు
గమునఁ బంచోత్తర గళితపంచసహస్ర । వర్తివిశ్వావసు వర్షమునను
సమధికశుభదమై మాఘకృష్ణతృతీయ । మందవారమునను నందమెసఁగ
శేషాద్రిశిఖరివిశేషభూషాయిత । దివ్యవిమానవర్తిష్ణుఁడైన
గీ॥ శ్రీనివాసునిసన్నిధిలోన నధికభక్తి సాంఖ్యాయనసగోత్రవార్ధిచంద్రుఁ
డనఁగఁ దగు సాంబశివకవి యారవిందుతారముగ నీకృతిసమర్పితం బొనర్చె॥

## ఆశ్వాసాంత్యము.

చ॥ భుజగధరాధరాగ్రతట భూషితదివ్యవిలాసమందిరా
త్రిజగదశేషచేతనపరిస్ఫుటరక్షణకృత్యబంధురా
భుజయుగవధ్యపీతపరి భూషితకౌస్తుభరత్నసుందరా
గజపరిపాలనోత్సవవికస్వరశంఖరథాంగయుక్కరా॥ ౧౨౦

## పుష్పగుచ్ఛబంధము

చ॥ పరమకుమారసజ్జధియాభక్తిభరానతధాతనూతనా
ధ్వరవరపారభాసిత దుర్గి తతిత్రితశుక్రరివారివైరి దు
స్తరసుసారవందిత ధృతవ్రిత భోగదమోరభాదయా
కరశర గోకిత్రికర కల్పకభక్ష్యద వేదసాదరా॥ ౧౨౧

## పాదభ్రమకందము

సారసవదాపసరసా మాతతశ్రిత హిమసుధాను మహితశ్రితరమా
తారసుతనుత సురపా పారదపాదప సుదాసువదసాదరపా ౧౨౨

## గద్య

ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాప్రసాదితానవద్యకవిత్వవిద్యాభినందన
గిరిజామనోహర చరణారవింద సేవామరందబిందు బృందతుందిల
మానసేందిందిర సాంఖ్యాయనసగోత్రజలధి చంద్రోదయా
యమాన సుబ్బారాయపౌత్ర పాపయామాత్య సంక్రం
దననందనసహజ పాండిత్యగేయ కవితా రమ
ణీయ సకలసుకవి విధేయ సాంబశివ
నామధేయ ప్రణీతంబగు సాత్రా
జితీ పరిణయంబున
పంచమాశ్వాసము
సంపూర్ణము.

# శుద్ధపత్రిక.

| పేజి. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 5 | నేత్రము | వేత్రము |
| 14 | 26 | మధ్యనిః | మధ్వనిః |
| 15 | 9 | కుంకితో | గుంఫితో |
| 18 | 21 | మహాశుధర్మ | మహాసుధర్మ |
| 21 | 21 | తననుప్ర | తనుప్ర |
| 26 | 17 | నేత్రము | శేత్రము |
| 28 | 29 | వచ్చుచుః | బుచ్చుచుః |
| 31 | 7 | మొఅుంగు | మెఱుంగు |
| | 15 | సుధ | సుద |
| 32 | 18 | నిలంబరు | నింబలరు |
| 35 | 8 | స్యరూప | స్వరూప |
| | 27 | బూనితీ | బూనిలే |
| | 28 | క్రియ | ప్రియ |
| 36 | 15 | లున్ వాదువా | లన్ హాదున |
| | 22 | ద్రుతన్వర | ద్రుతస్వర |
| 37 | 20 | ద్యుత | ద్యుతి |
| 38 | 16 | మేలిచ | మేవివ |
| 39 | 19 | వాత | గావత |
| 40 | 4 | హాంబు | హాంబున |
| | 23 | సత్యముల | సత్వముల |
| 41 | 14 | బధిరత | బధిరిత |
| 42 | 15 | గనిమును | గనిహారిమును |
| 44 | 11 | నీవుహోవ | నీఫుప్రోవ |
| | 25 | విలావి | విలాసవి |
| 45 | 18 | ార్య | ఛార్య |
| | 27 | నోద్ధానీ | నోధానీ |
| 47 | 4 | లేవి | లేలి |
| | 17 | పలిస్ఫు | పవిస్ఫు |
| | 18 | సిఖి | శిఖి |
| 48 | 8 | నంష్ట్రికారుదము | నదంష్ట్రికారుము |
| | 23 | నోకట్రుట | నోకొట్రుట |

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | 25 | కాతుక | కౌతుక |
| 49 | 14 | స్వవి | సర్వవి |
| 53 | 22 | శూరి | శూలి |
| 55 | 19 | తలపంగ | తలంపఁగ |
| 57 | 29 | స్వాంత | స్వాంత |
| 58 | 23 | సతతో | సంతతో |
| 61 | 28 | లోని | లోలి |
| 63 | 7 | కాకవి | కాకలి |
| | 9 | వింత | వింత |
| 65 | 10 | పుష్పవి | పుష్పలి |
| | 29 | సూన | సూన |
| 66 | 10 | లియుక్తి | వియుక్తి |
| | 16 | నటించు | నటించు |
| | 28 | లెసగం | లెసఁగం |
| 67 | 25 | యవి | యశి |
| | 28 | వనివత | వనిత |
| 68 | 2 | నవనవిహారస్ఫు | వనవిహారస్ఫు |
| | 17 | లామూగి | లానమూగి |
| | 24 | వెట్టి | వెట్టు |
| | 35 | ద్రచ్చె | ద్రచ్చె |
| 69 | 34 | మండి | మండి |
| 71 | 22 | జన | జగ |
| | 31 | వెలరు | వెలి |
| 73 | 25 | పరిభాగ | ... |
| 75 | 19-20 | మధ్య)................గీ॥ శంబరారాతిమార్గణచకితచకిత | |
| | 20 | శారి | శౌరి |
| 78 | 4 | నర్వ | సుర్వ |
| | 21 | వసులిచ్చి | వినువిచ్చి |
| 81 | 3 | ర్వష్ఠ | రిష్ఠ |
| 82 | 27 | దశ్వ | దశ్వ |
| 85 | 20 | హేమ | హైమ |
| 87 | 34 | వారిదగ్ర | వారిదాగ్ర |
| 90 | 31 | చిత్రిన | చిత్రక |
| | 32 | పరిగాహ | పరిణాహ |

| పేజి. | పంక్తి. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 92 | 9 | నాడు | నాడ |
| 93 | 11 | తెతమ | తేజమ |
| 95 | 4 | కుంతలం | కుంతలక |
| | 6 | సంంతిన్ | సంతతిన్ |
| | 25 | త్రియమూ( | త్రియములు |
| 96 | 12 | మునసు | మునను |
| 98 | 33 | మహాసుర | మహీసుర |
| 99 | 25 | కలివమిచెలునిచ్చి | కలిమిజాలువనిచ్చి |
| 102 | 12 | పొదిలి | పొదివి |
| | 34 | యుంతాగ | యుగతా |
| 103 | 33 | సరోజి | సరోజి |
| | 23 | మహాయా | మహీయా |
| | 27 | ముఖి | ముఖు |
| 105 | 6 | శాఘక్య | శాఖక్య |





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B200 |
| పుస్తకం పేరు | సాత్రాజితీ పరిణయము |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 117 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | B,106,4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | kasimbi |
| పేజీలు విడదీసినది | kasimbi |
| స్కాన్ చేసినది | Ch.Ramya |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| [illegible]గు చేసినది | |
| | GOOD |